నాపేరు
చాకో-క్రీమ్!




"ఇటు గొడవ,
అటు సంరంభం...
తినండి టాఫీలు,
చెయ్యకండిక ఆలశ్యం!!"




నాపేరు
కాఫీ-క్రీమ్!

Ravalgaon
Double
Trouble
Toffees

గొడవ రెండింతలు, సరదా!!




# ఉచితముగా పొందండి.

BLAZE

**DISNEY FUN** హాస్య కథల పుస్తకము 8

**జోక్స్** కవర్లతో







రూ.5/-

మీకు ఏ విధమైన అదనపు ఖర్చు లేకుండా మీ హాస్యపు పుస్తకముల సంఖ్య పెరుగుట గమనించండి. అవును మీ హాస్యపు పుస్తకములు సంఖ్య అధనపు ఖర్చు లేకుండా పెరుగుతుంది. 8 జోక్స్‌పై ఖాళీ కవర్సును ఇచ్చి బ్లేజ్ డిస్నీఫన్ కామిక్ ఉచితముగా తీసుకొనండి.



జోక్స్ ఖాళీ కవర్సును మీ దగ్గరలోనున్న ఏదైన మార్పిడి కేంద్రములో
ఇచ్చి బ్లేజ్ డిస్నిఫన్ కామిక్ ఉచితముగా తీసుకొనండి లేదా
ఈ క్రింది విరునామాకు వ్రాయండి.
మిస్టర్ జోక్స్
పి.ఓ. అరోవిల్లి-605 101
జోక్స్-క్రిస్పిర్ క్రీమియర్ చాకోలేట్ వేఫర్

AFL 2387









# కొత్త కేమ్లికాల్-86
## ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ అడ్హెసివ్

పగిలిన బొమ్మలు, ఫర్నిచరు సామాన్లు, ఫోటో ఫ్రేములు, ఇంట్లో వస్తువులు, ప్యాకేజింగులు, బహుమతి ప్యాకెట్లు వగైరా వగైరా.

కొత్త కేమ్లికాల్-86 వాటిని శాశ్వతంగా అతికించి వేస్తుంది. త్వరగా, సునాయాసంగా, చౌకగా కూడా! ఇది మీ యింట్లో ఉండవలసిన అత్యంత అనువైన బహుప్రయోజన అడ్హెసివ్. మీ స్వంత చేతులతో కళా సృజనకు కూడా ఎంతో గొప్పగా పనికొస్తుంది!

కొత్త కేమ్లికాల్-86 వెనుక కేమ్లిన్ వారి స్వంత పరిశోధన-అభివృద్ధి కృషి ఉంది, అత్యుత్తమమైన ఆర్టు, స్టేషనరీ సామాన్లను మీకందించడంలో యాభై ఏళ్లకు మించిన అనుభవం ఉంది. అన్నిటికంటే ముఖ్యంగా, నాణ్యతకై కేమ్లిన్ ఆర్జించిన ఖ్యాతి ఉంది.



మరింత మంచి అడ్హెసివ్

కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్, స్టేషనరీ డివిజన్, బొంబాయి-400 059.

AYOJAN-C-TEL 1



# మిఠాయిల మహారాజు కొత్త మిఠాయి అందిస్తున్నాడు-
# కాఫీ రుచిని కొరుక్కుతిని ఆనందించడానికి!







# కాఫీ బైట్



మృదువైనది, విలువైనది, మీగడ చేరిన మిఠాయి—అసలైన కాఫీ రుచి కలిపినది. మీరు కోరే రీతిలోనే తయారు చేసినది. ఈ రోజే కొనండి.

<u>రకరకాల ప్యారీస్ మిఠాయిలు:</u>

కారమిల్స్
చాకొలెట్ ఎక్లెయిర్స్
ట్రి-మి • చాక్లెయిర్స్
కోకొనెట్ క్రీమ్
లాలీపాప్స్ • కాఫీ బైట్




70 సంవత్సరాలకుపైగా
మిఠాయిలలో మొట్టమొదటి పేరు.




ప్యారీస్ అందిస్తున్న శ్రేష్ఠమైన తయారీ

HTA.7020

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["ధైర్యవంతుడు"]కు ఆధారం. జొన్నలగడ్డ రామలక్ష్మి రచన.

ఎంతటి తెలివితేటలు కలవాడైనా, ఒకసారి దురాశాపిశాచానికి లొంగిపోవడం జరిగితే, అతడిలో నీత్యవినీతులా, సాధ్యాసాధ్యాల విచక్షణా జ్ఞానం నశించి, తప్పక చిక్కులపాలవుతాడు. ''పాముల వాడి సాక్ష్యం'' అన్న కథలో, యీ వాస్తవం తెలుసుకుంటాం.

## అమరవాణి

లోకయాత్రా భయో లజ్జా, దాక్షిణ్యం త్యాగశీలతా,
పంచ యత్ర న విద్యంతే, న తత్ర దివసం వసేత్.

[బ్రతుకుతెరువు, న్యాయం, లజ్జ, దీనులపట్ల కరుణ, త్యాగబుద్ధి—ఈ అయిదూ లేనిచోట ఒక్క రోజు కూడా నివసించకూడదు.]




సంపుటి 81 జూలై '87 సంచిక 1

విడి ప్రతి : 2–50 :: సంవత్సర చందా : 30–00

## హార్లిక్స్ బిస్కెట్లది సాటిలేని రుచి
## వాటిని తినడానికి పిల్లె లెన్ని వున్నాయి వేచి.




**హార్లిక్స**
**బిస్కెట్స్**

హార్లిక్స లోని పోషకాలు నిండిన కరకర గరగర బిస్కెట్!

HTA 5030 TEL B

# చందమామ కబుర్లు



## పుష్ప సంగీతం!

జపానుదేశానికి చెందిన శాస్త్రవేత్తలు కొందరు—పుష్పదళాల నుంచి వెలువడే సూక్ష్మమైన కదలికలను కంప్యూటర్ల ద్వారా సంగీతంగా మార్చేపద్ధతిని కనుగొన్నారు. ఇంకా ప్రారంభ దశలోనే ఉన్న ఈ ప్రయత్నం త్వరలో కార్యరూపం దాల్చ గలదు।

## ఇరవై భాషల నిఘంటువు!

హంగరీలోని ఇంటర్‌నేషనల్ కౌన్సిల్ ఆఫ్ మ్యూజియాలజీ సంస్థ తరఫున—28 దేశాలకు చెందిన 100 మంది విద్యావేత్తల పది సంవత్సరాల కృషి ఫలితంగా—వస్తుప్రదర్శనశాలకు సంబంధించిన 20 భాషల నిఘంటువు ఒకటి రూపొందించబడింది।






## పక్షుల ఆత్మహత్య?

మహారాష్ట్రంలోని థానేజిల్లా మూరాబాద్ తాలూకాలో 750 మీ॥ ఎత్తయిన మాల్‌షెజ్‌ఘాట్ అనే పర్వతశిఖరం మీద ఒక లోయ ఉన్నది. యేటా కొన్ని వారాలపాటు పొగమంచుతో కూడుకున్న ఉధృతమైన గాలులు వీచడం వల్ల, అక్కడి రకరకాల పక్షులు గుంపులు గుంపులుగా చచ్చిపోతున్నాయి।

## మరిచిపోయిన సమాధి!

డా॥ తేజాసింగ్ కుమారుడైన బోరిస్‌సింగ్—రెండవ ప్రపంచ యుద్ధంలో లిథుయానియాలో నాజీ దురాక్రమణ దారులతో వీరోచితంగా పోరాడి ప్రాణత్యాగం చేశాడు. ఇటీవల కొందరు బడిపిల్లలు సాహసవీరుడయిన ఆ బాలుడి సమాధిని కనుగొన్నారు. ప్రస్తుతం సింగ్ సతీమణి రష్యాలోని ఉజ్బెకిస్థాన్‌లో నివసిస్తున్నది.



పురాణగాథలు :

# క్షేమ

శాగలరాజ్య రాణి క్షేమ అపురూపసౌందర్యవతి. తన అందచందాలకు, ఆమె లోలోపల ఎంతగానో మురిసిపోయేది. ఆమెలో ఇసుమంత గర్వం కూడా ఉండేది.

రాజు బుద్ధుడి బోధలు విని ఆయన శిష్యుడయ్యాడు. రాణి కూడా బుద్ధుడి దర్శనం చేసుకోవడం మంచిదని ఆయన ఆశించాడు. కాని రాణి అందుకు సుముఖంగా లేదు. దానికి కారణం రాణికి బుద్ధుడంటే గౌరవం లేకపోవడం కాదు. కాని, ఆయన బాహ్యసౌందర్యానికి విలువనివ్వడని విని ఉండడం వల్ల, తనపట్ల ఆదరం చూపడేమో అని ఆమె సందేహించింది।

ఒకనాడు రాజసభలో ఆస్థానకవి, రాజోద్యానమైన వేణువన వసంతశోభను అభివర్ణిస్తూ కొన్ని పద్యాలు చదివాడు. ఆ వర్ణనను వినగానే, రాణికి వేణువనాన్ని చూడాలన్న కోరిక కలిగింది. మర్నాడే ఆమె ఉద్యానవనానికి బయలుదేరింది.

ఆ సమయంలోనే బుద్ధుడు కూడా వేణువనంలో మకాం చేసి ఉన్నాడు. అయితే ఆ విషయం రాణికి తెలియదు. ఒక వృక్షం చల్లటినీడలో బుద్ధుడు విశ్రాంతి తీసుకుంటున్నాడు. నవయౌవనంలో ఉన్న ఒక అందాలరాశి పక్కన నిలబడి ఆయనకు మెల్లగా వీస్తున్నది. ఆ దృశ్యాన్ని చూసి రాణి అమితాశ్చర్యంతో అటుకేసి నడిచింది. ఆమె వాళ్ళను సమీపిస్తున్నకొద్దీ, బుద్ధుడి పక్కన ఉన్న అందాలరాశి అందాలు క్రమక్రమంగా కనుమరుగవుతూ, శిరోజాలు నెరసిపోయి, నడుం వంగి, చర్మం ముడతలు పడి వృద్ధాప్యం ఆవరించింది।

తనకు సేవచేస్తున్న అప్సరసద్వారా బుద్ధుడు—క్షేమకు యౌవనం, బాహ్యసౌందర్యం ఎంతటి క్షణికమైనవో ప్రత్యక్షంగా చూపాడు. శాశ్వత సౌఖ్యాన్నిచ్చే అంతఃసౌందర్యం గురించీ, ధర్మజీవనం గురించీ బోధించాడు. క్షేమలోని గర్వం తొలగిపోయింది. ఆమె బుద్ధుడి పాదాలకు ప్రణమిల్లి ఆయన శిష్యురాలయింది।





# పాములవాడిసాక్ష్యం

తారాచంద్రుడనే రాజు, అనంగదేశాన్ని పరిపాలిస్తూండేవాడు. ఆయనకు యిద్దరు కొడుకులు. పెద్దవాడు చంద్రాంగుడు. చిన్నవాడు తారాంగుడు. వృద్ధుడైన తండ్రి మరణించేనాటికి, యిద్దరూ యుక్త వయస్కులయ్యారు.

తండ్రి మరణానంతరం, చంద్రాంగుడు అనంగదేశానికి రాజయ్యాడు. లక్ష్మణుడి లాంటి తారాంగుడు, పరిపాలనా విషయాల్లో, అన్నకు చేదోడు, వాదోడుగా వుండేవాడు. ఆ అన్నదమ్ముల సఖ్యత, అందరికీ అశ్చర్యం కలిగిస్తూండేది.

చంద్రాంగుడు దినమంతా తీరిక చిక్కని రాజకార్యాల్లో గడిపి, సాయం సమయంలో, రాజప్రాసాదానికి దాపుల నున్న ఉద్యానంలో, ఏకాంతంగా కొంత సేపు విశ్రాంతి తీసుకునేవాడు. అలాంటి సమయాల్లో, ఒక్కొక్కప్పుడు తారాంగుడు అక్కడికి వచ్చి, ఏవైనా ముఖ్య విషయాలుంటే, వాటి గురించి అన్నతో మాట్లాడి వెళ్ళిపోయేవాడు.

ఒకనాడు చంద్రాంగుడు, తమ్ముడిని సరిహద్దు రాజ్యమైన చంపకరాజ్యానికి పని మీద పంపాడు. ఆ సాయంత్రం అన్ని కార్యకలాపాలూ ముగిసిన మీదట, చంద్రాంగుడు ఉద్యానవనానికి వెళ్ళాడు.

క్రమంగా సూర్యుడస్తమించి, నలుమూలలా చీకటి కమ్ముకోసాగింది. చంద్రాంగుడు ప్రాసాదానికి బయలుదేరాడు. ఆ సమయంలో, అతడొక పొదరింటి పక్కన నడుస్తూండగా, ఆహారం కోసం గాలిస్తున్న నాగుపామొకటి, అతడి కాలును కాటువేసి, జరజరా పొదల్లోకి పారిపోయింది.

పాము కాటువేయగానే, బాధతో చంద్రాంగుడు పెద్దగా కేక పెట్టి పడి

గంగిశెట్టి శివకుమార్

పోయాడు ఆ కేక వింటూనే భటులు అక్కడికి వచ్చి, స్పృహ కోల్పోతున్న చంద్రాంగుణ్ణి అంతఃపురానికి తీసుకు పోయారు. వైద్యులు ఆయనకు చికిత్స ప్రారంభించారు.

సరైన సమయానికి ఆస్థానవైద్యులు చేసిన చికిత్సవల్ల, చంద్రాంగుడికి ప్రాణం దక్కిందిగాని, నోటిమాట పడి పోయింది.

ఉద్యానవనంలో, పాములజాడ యింత వరకూ, ఎవరూ కనీ వినీ ఎరుగనిది. రాజును హతమార్చడానికి ఎవరైనా కుట్రపన్నారా? అన్న అనుమానం కొందరికి కలిగింది. ఈ సంగతి మంత్రి తెలుసుకున్నాడు.

అతడు యిలాంటి అవకాశం కోసమే ఎదురుచూస్తున్నాడు. రాజవంశాన్ని తుద ముట్టించి, అనంగదేశానికి రాజు కావా లన్న కోరిక, ఎంతో కాలంగా అతణ్ణి బాధిస్తున్నది. రాజు కదిలేందుకూ, మాట్లాడేందుకూ అశక్తుడు. కనుక, చిన్న వాణ్ణి ముందు హతమార్చితే, తర్వాత రాజు ఆటంకాన్ని తేలికగా తొలగించుకో వచ్చు!

ఇందుకుగాను మంత్రి, ఒక పథకం తయారు చేసి, అందరితో, ''మహారాజు గారికి జరిగిన ప్రమాదం వెనక, ఏదో కుట్ర వున్నదాంట్లో సంశయం లేదు. ఆయన ఉద్యానంలో వాహ్యాళికి వెళ్ళే సమయం, సందర్భాలు ఎరిగినవాడే,



యీ కుట్రకు కారకుడై వుండాలి. ఒకటి, రెండు రోజుల్లో—తగిన సాక్ష్యాధారాలు సంపాయించి, ఆ కుట్రదారుణ్ణి ఉరి కంబం ఎక్కించగలను," అనసాగాడు.

రెండు రోజుల తర్వాత, చంపకదేశంలో వున్న తారాంగుడికి, తన అన్న పాము కాటుకు గురయినవార్త అందింది. అతడు వెంటనే బయలుదేరి రాజధానికి వచ్చి, చంద్రాంగుడికి తగిన చికిత్స చేసేందుకు, మరి కొందరు ఘనవైద్యులను నియమించి, రాజ్యపాలనా భారం తన చేతికి తీసుకున్నాడు.

ఈ లోపల మంత్రి, తనకు నమ్మకమైన ఒక భటుడి ద్వారా, నగరంలో పాములు పట్టడంలో ప్రసిద్ధుడైన ఒకణ్ణి పిలిపించి, వాడితో రహస్యంగా, "ఒరే, నీ అదృష్టం పండబోతున్నది! అందుకే, నిన్ను పిలిపించాను," అన్నాడు.

పాములుపట్టేవాడు, ఎంతో వినయంగా, "అయ్యా, ఆ అదృష్టమేమిటో దయచేసి చెప్పండి!" అన్నాడు.

"నువ్వు, మన రాజుగారి తమ్ముడు తారాంగుడిని గురించి వినే వుంటావు. అతడు ఐదారు రోజుల క్రితం, నిన్ను పిలిపించి, కాటువేస్తే మరణం తప్పనంత విషప్రభావం గల పాము నొకటి కొన్నట్టు, రేపు నిండుసభలో, జంకుగొంకులు లేకుండా చెప్పాలి. మిగిలినదంతా, నేను చూసుకుంటాను. పని ముగిశాక, నీకు ఐదువేల వరహాలిస్తాను. నీ జీవితం, ఏ





చీకూచింతలు లేకుండా, హాయిగా గడిచిపోతుంది,'' అన్నాడు మంత్రి.

పాములు పట్టేవాడు, ''సరే, తమ అజ్ఞ!'' అని, మంత్రికి నమస్కరించి వెళ్ళిపోయాడు.

మర్నాడు నిండుసభలో మంత్రి సభికుల నుద్దేశించి, ''మహారాజుగారిని పాము కాటు వేయడం వెనక, పెద్ద కుట్ర వున్నదని, తగు సాక్ష్యాధారంతో, నిన్ననే తెలుసుకున్నాను. మహారాజుగారు ప్రమాదవశాత్తూ, పాము కాటుకు గురికాలేదు. ఇప్పుడు సింహాసనంలో వున్న తారాంగుడే, పదవీకాంక్ష కొద్దీ, అన్న ప్రాణాలు తీసేందుకు ఒడికట్టాడు'' అన్నాడు.

మంత్రి యిలా చెప్పగానే, సభలో పెద్ద కలకలం బయలుదేరింది. తారాంగుడు నివ్వెరపోయాడు.

మంత్రి మందహాసం చేస్తూ, ''నిజమే, ఈ సంగతి, మీలో చాలామందికి ఆశ్చర్యం కలిగించవచ్చు. నేను కూడా చాలా ఆశ్చర్యపోయాను, మొదటిసారిగా విన్నప్పుడు. కాని, బలమైన సాక్ష్యాధారం లభించాక, పూర్తిగా నమ్మకం కలిగింది,'' అని, భటులకు, పాములు పట్టేవాణ్ణి హాజరుపరచమని ఆజ్ఞాపించాడు.

పాములుపట్టేవాడు సభలోకి వచ్చి, దిక్కులు చూస్తూ నిలబడ్డాడు. అప్పుడు మంత్రి, వాడితో, ''ఒరే, నీకొచ్చిన భయం ఏమీలేదు. నిజం చెప్పు!'' అన్నాడు.

తారాంగుడు, యీ జరుగుతున్నది నిజమా, కలా అన్నట్టు విస్తుపోయి, పాములవాడికేసి చూడసాగాడు. పాములవాడు, ఒకసారి గొంతు సవరించుకుని, ''అయ్యలారా, నేను నిజం చెబుతున్నాను! రాజుగారిని, ఆయన తమ్ముడు నిజంగా పాముకాటుకు గురిచేశాడో లేదో, నాకు తెలియదు. కాని, మంత్రిగారు, ఒక భటుడి చేత నన్ను పిలిపించి, ధనాశ చూపి, రాజుగారి తమ్ముడు, నావద్దనుంచి విషసర్పాన్నొకదాన్ని కొన్నట్టు సభలో చెప్పమన్నారు. అడుగో, మంత్రిగారు,

నావద్దకు పంపిన భటుడు, ఆ ద్వారంవద్ద నిలబడి వున్నాడు.'' అని చెప్పాడు.

తన పథకం తారుమారైనందుకు, మంత్రి ఎక్కడలేని కోపంతో, ''ముందు, ఈ అబద్ధాలుపలికే పాములవాణ్ణి శిరశ్ఛేదం చేయండి!'' అంటూ అరిచాడు.

ఆ వెంటనే, తారాంగుడు సింహాసనంలో నుంచి లేచి, భటులకు, ''ఈ దుష్ట మంత్రినీ, ద్వారం దగ్గిరనుంచి పారిపో జూస్తున్న భటుణ్ణీ బంధించండి!'' అని ఆజ్ఞాపించాడు.

భటులు క్షణాల మీద వాళ్ళిద్దర్నీ బంధించారు. తారాంగుడు, పాములు పట్టేవాడితో, ''పేదవాడివై వుండీ, ధనాశకు లొంగక, నిజం చెప్పి, ఎంతో రాజభక్తిని చూపావు. నీ కారణంగానే, సభాముఖంగా మంత్రి దుర్బుద్ధి బయటపడింది,'' అన్నాడు.

అందుకు పాములుపట్టేవాడు, ''మహా రాజా, మంత్రిగారు భటుడి చేత నన్ను పిలిపించి, సాక్ష్యం పేరుతో పెద్ద అబద్ధం చెప్పమనగానే, ఆయన కుట్ర, నాకు తెలిసిపోయింది. ఆయన పాములాంటి వాడని పసిగట్టాను. నా వృత్తే పాములు పట్టడం గదా! ఆయన చెప్పినదానికి, అప్పటికి సరే అని, సభలో ఆయన కుట్ర బయటపెట్టాను,'' అన్నాడు.

తారాంగుడు, వాడి మాటలకు ఎంతో సంతోషించి, ''నీవంటి రాజభక్తికల వాడు, పాములుపట్టి బతకడంకాదు—మా ఆస్థానంలో ఉద్యోగిగా వుండడం అవసరం!'' అని, వాడికి అప్పటికప్పుడే, ఆస్థానంలో మంచి పదవియిచ్చాడు.

తర్వాత, తారాంగుడు మంత్రిని కారాగారంలో వేయించి, తన అమాయకత్వం కొద్దీ మంత్రికి సాయపడిన భటుణ్ణి క్షమించి వదిలివేశాడు.

కొన్నాళ్ళకు, వైద్యుల చికిత్సవల్ల, పూర్తిగా ఆరోగ్యవంతుడైన అన్న చంద్రాంగుడికి సింహాసనం అప్పగించి, తారాంగుడు ఎప్పటిలాగే అతడికి రాజ్యపరిపాలనా విషయాల్లో సాయపడసాగాడు.






# నిజమైన పండితుడు

హిమాలయ పర్వత ప్రాంతాన గల, చంపకవనంలో, జ్ఞానసూర్యు డనే పండితుడు గురుకులం నడుపుతూండేవాడు. ఆయన వేదవేదాంగాలనూ, ఉపనిషత్తులనూ క్షుణ్ణంగా అధ్యయనం చేసిన మహా పండితుడు. దేశదేశాలనుంచి విద్యార్థులు వచ్చి, ఆయనవద్ద విద్యాభ్యాసం చేస్తూండే వాళ్ళు.

ఒక రోజు ఉదయం జ్ఞానసూర్యుడు, కొంతమంది శిష్యులకు, ఒక వటవృక్షం కింద కూర్చుని పాఠాలు చెబుతూండగా, దక్షిణాపథం నుంచి చక్రతీర్థు డనే పండితుడు, ఆయనను చూడవచ్చాడు.

చక్రతీర్థుడు, జ్ఞానసూర్యుడికి, తనెవరైందీ చెప్పి, "దేశదేశాలన్నీ సంచరిస్తూ, ఎందరో ఉద్దండులైన పండితుల్ని వాదనలో ఓడించాను. కాని, తమ పేరు ప్రఖ్యాతుల గురించి విన్న తర్వాత, తమను కూడా వాదనలో ఓడించితే తప్ప, నాకు మనశ్శాంతి కలిగేలాలేదు," అన్నాడు.

ఆ మాటలకు జ్ఞానసూర్యుడు మందహాసంచేసి, "అలాగా! అయితే, మీరు, పాటలీపుత్రంలో వుంటున్న, నా శిష్యుడు సరళకుణ్ణి కూడా ఓడించే, ఇక్కడికి వచ్చారా?" అని అడిగాడు.

చక్రతీర్థుడు ఆశ్చర్యపోతూ, "నేను పాటలీపుత్రంలోని పండితు లందర్నీ, ఏనాడో ఓడించాను. అయితే, మీరు చెప్పిన పేరుగల పండితుడెవడూ, అక్కడ నాకు తటస్థపడలేదు," అన్నాడు.

"సరళకుడు నిగర్వి; నిరాడంబరుడు. తన పాండిత్యం యింతవరకూ, ఎవరి ముందూ ప్రదర్శించి వుండకపోవచ్చు. అందువల్లనే, అతడి పేరు పాటలీపుత్రంలో చాలామందికి తెలిసివుండదు. మీరు నాతో వాదించాలనుకుంటే, ముందుగా

కమలిని

సరళకుణ్ణి ఓటమి పాలు చేసి రావలసి వుంటుంది.''' అన్నాడు జ్ఞానసూర్యుడు.

ఇది విని చక్రతీర్థుడు కోపాన్ని అపు కుంటూ, ''నాతో వాదనకు దిగకుండా తప్పించుకునేందుకు, మీరిలాంటి సాకు చెబుతున్నట్టు,నాకుతోస్తున్నది,"అన్నాడు.

ఇందుకు జ్ఞానసూర్యుడు, అతణ్ణి మందలిస్తున్నట్టుగా, ''నన్ను వాదనకు పురిగొల్పచూస్తున్నది, మీరు! అందువల్ల, నే పెట్టిన నియమాన్ని ఒప్పుకుతీరాలి,'' అని, చక్రతీర్థుణ్ణి పంపించివేశాడు.



కొన్నాళ్ళ తర్వాత, చక్రతీర్థుడు పాటలీపుత్రంచేరి,చివరకుసరళకుడిఇల్లుతెలుసుకున్నాడు. ఆ సమయంలో సరళకుడు, తన శిష్యులతో శాస్త్రచర్చ చేస్తున్నాడు.

చక్రతీర్థుడు, అది ముగిసేవరకూ ఆగి, సరళకుడికి తనను గురించి పరిచయం చేసుకుని, ''ఇప్పుడు జరిగినదంతా విన్నాను. ఇంతకూ, మీరు శిష్యులకు పాఠాలు చెబుతున్నారా? లేక వాళ్ళు, మీకు విద్యాబోధ చేస్తున్నారా? అన్న సంశయం కలుగుతున్నది,'' అన్నాడు.

అందుకు సరళకుడు చిన్నగా నవ్వి, ''నా పాఠశాలలో, అటువంటి పట్టింపు లేవీ వుండవు,'' అన్నాడు.

''అంతా అయోమయంగా వున్నది! నేను, మీతో వాదనలో గెలవాలని యింత దూరం వచ్చాను. అది జరిగాక, మీ గురువుగారైన జ్ఞానసూర్యుడితో, వాదించ వలసి వున్నది,'' అని జరిగినదంతా చెప్పి, ''మీరు, నాతో వాదనకు సిద్ధంగా వున్నట్లే గదా!'' అన్నాడు చక్రతీర్థుడు.

సరళకుడు, ''వాదమా! నేనెవరితోనూ, ఎటువంటి వాదనకూ దిగనని, మా గురువర్యులకు తెలుసు. ఆయన, మిమ్మల్ని నాతో వాదనకు పంపారన్న మాట, నమ్మశక్యంగా లేదు,'' అన్నాడు.

ఇది వింటూనే, చక్రతీర్థుడు అవహేళనగా, ''మీ గురుశిష్యులిద్దరూ, నాతో వాదనకు దిగకుండా, తప్పించుకోవాలన్న ఉద్దేశంలో వున్నట్టు కనబడుతున్నది. మీరు

ఓటమిని అంగీకరించినట్టు ఒప్పుకుంటే, నాదారిన నేను వెళతాను," అన్నాడు.

''నేను, మీతో వాదనకు దిగనన్నాను కాని, జ్ఞానానికి సంబంధించిన ఏ విషయంలో అయినా, చర్చకు ఎప్పుడూ సంసిద్ధుడనే,'' అన్నాడు సరళకుడు.

''అందువల్ల, నాకు కలిగే ప్రయోజనం ఏమిటి?'' అన్నాడు చక్రతీర్థుడు కోపంగా.

సరళకుడు ఎంతో శాంతంగా, ''పండితులు, తోటి పండితులతో విషయ చర్చకు దిగినప్పుడే, తమకున్న జ్ఞానాన్ని వారితో పంచుకోవడానికీ, పెంపుచేసుకోవడానికూడా అవకాశం వుంటుంది. అలాకాక, వాదనకు తలపడిన పక్షంలో ఒకరినొకరు మరొకరు ముందుగా మూయించాలన్న ప్రయత్నం జరుగుతుంది. అందువల్ల, పండితులు తమకున్న జ్ఞానంకన్న, అజ్ఞానాహంకారాలనే ఎక్కువగా ప్రదర్శించే ప్రమాదం వున్నది. ఈ కారణంవల్లనే నేను, తమతో వాదనకు దిగనన్నాను. అన్యథా భావించకండి,'' అన్నాడు.

చక్రతీర్థుడు, యీ మాటలువిని, కొంత సేపు మౌనంగా వూరుకుని, సరళకుడి దగ్గిర సెలవు తీసుకుని, జ్ఞానసూర్యుడుండే చంపకవనానికి బయలుదేరాడు.

తిరిగివచ్చిన చక్రతీర్థుణ్ణి చూసి, జ్ఞానసూర్యుడు, ''సరళకుడు కనిపించాడా? వాదనలో అతణ్ణి జయించివచ్చారా?'' అని అడిగాడు.

చక్రతీర్థుడు, జ్ఞానసూర్యుడి పాదాల ముందు మోకరిల్లి, ''జ్ఞానమన్నది అవధులు లేనిది; అది ఏ ఒకరిసొత్తూ కాదు,'' అని, సరళకుడు అన్న మాటలు జ్ఞానసూర్యుడికి చెప్పి, ''ఈ సంగతి నాకు తెలిసేందుకే, మీరు నన్ను సరళకుడి దగ్గిరకు పంపారు. నేను, సరళకుడిలాంటి పండితుణ్ణి కావాలనుకుంటున్నాను. అది, మీ శిష్యరికంలోనే సాధ్యం,'' అన్నాడు.

జ్ఞానసూర్యుడు, అతణ్ణి లేవనెత్తి, శిష్యుడుగా స్వీకరించాడు. ఆ తర్వాత కొన్నేళ్ళకు, చక్రతీర్థుడు గొప్ప పండితుడుగా కీర్తి సంపాయించాడు.






## 15

[పదిహేను సంవత్సరాల కాలం గడిచిపోయింది. ఇప్పుడు ఉగ్రదత్తుడూ, అతడి స్నేహితులైన రుద్రారుద్రులూ ఇరవై ఏళ్ళ యువకులు. వాళ్ళు ఒకనాడు అడవిలో తిరుగుతూండగా, ఒక స్త్రీ ఆర్తనాదం వినిపించింది. వాళ్ళు ఆమె రక్షణకోసం పరిగెత్తి వెళ్ళేసరికి, పులిరాయుళ్లు వాళ్ళను పట్టుకుని బంధించి భయంకర పక్షులకేసి లాక్కుపోయారు. తరవాత—]

హఠాత్తుగా కనురెప్పపాటు కాలంలో జరిగిపోయిన ఈ దుస్సంఘటన ఉగ్రదత్తుణ్ణి నిశ్చేష్టుణ్ణి చేసింది. తనూ, తన స్నేహితులూ ముందువెనుకలు ఆలోచించకుండా సరాసరి శత్రువులు పన్నిన ఉచ్చుల్లో తల దూర్చి, వాళ్ళ చేజిక్కారు. 'రక్షించండి' అంటూ ఆర్తనాదం చేసిన, ఆ యువతి కూడా ఈ దుర్మార్గుల పాలబడి వుంటుందా? లేక వీళ్ళ బారి నుంచి తప్పించుకుని కోట కేసి పారిపోయి వుంటుందా?

ఆ యువతి సురక్షితంగా యిక్కణ్ణించి తప్పించుకు పోగలగటం అసంభవం అని ఉగ్రదత్తుడికి వెంటనే తోచింది. ఆవిడ పెట్టిన కేకలూ, పులిరాయుళ్ళు చేసే అట్టహాసాలూ విని, ఎవరైనా కోటలో నుంచి బయటకు వస్తే తప్ప, తమకు ఈ దుర్మార్గుల నుంచి రక్షణ లేదు.




ముచ్చటగా దొరికిన ఈ ముగ్గురూ మహ పసందైన మూర్ఖుల్లా వున్నారు. ఇక ఆ సామంతరాజు సుదర్శనుడి కూతురు చిత్రసేన తెలివితేటలెలాంటివో తెలుసుకో వాలి," అంటూ హేళనగా నవ్వాడు.

ఆ పులిరాయుడి మాటలవల్ల ఉగ్రదత్తుడికి ఆ యువతి ఎవరో తెలిసిపోయింది. వాడు విజయగర్వంతో ఒళ్ళు మరిచి, తనకు అడక్కుండానే ఆర్తనాదం చేసిన యువతి సమాచారం అంతా చెప్పేశాడు. బహుశా ఈ పులిరాయుడూ మూర్ఖుడే అయి వుంటాడు, అనుకున్నాడు ఉగ్రదత్తుడు.

"రుద్రా!" అంటూ ఉగ్రదత్తుడు కేక పెట్టాడు. అతడికి తన స్నేహితు లెక్కడున్నారో తెలియటం లేదు. ఇద్దరు పులిరాయుళ్ళు అతణ్ణి కొయ్యదుంగ మాదిరిగా భుజాన వేసుకుని పక్షి మీదికి ఎక్కించేందుకు ప్రయత్నిస్తున్నారు.

"ఉగ్రదత్తా! నా కాళ్ళూ చేతులూ కట్టి నన్ను భయంకర పక్షి మీదికి ఎక్కించారు. అరుద్రుడు కూడా, ఈ దుర్మార్గులకు దొరికిపోయాడు. నువ్వూ చిక్కిపోయావా?" అంటూ రుద్రుడు కేక పెట్టాడు.

"నోళ్ళు ముయ్యండి!" అంటూ ఒక పులిరాయుడు పెద్దగా అరిచి, "మనకు

ఇంతలో కోటవైపునుంచి పెద్ద కలకలం వినబడింది. గుర్రాల సకిలింపులూ, రౌతులు పెట్టే కేకలూ వింటూనే, ఉగ్రదత్తుడు తమకు సహాయం వస్తున్నదనుకున్నాడు. రాజకుమార్తె చంద్రసేన కేకలు కోటలోవాళ్ళకు వినబడి వుంటవి. తనను బంధించిన తాళ్ళు తెగగొట్టుకోగలిగితే ఎంత బావుండును!

ఉగ్రదత్తుడు, కాళ్ళూ, చేతులూ ఆడిస్తూ పెనగులాడటంప్రారంభించేసరికి, ఒక పులిరాయుడు భీకరంగా అరుస్తూ, అతడి గుండెల మీద ఈటె ఆనించి, "కదిలావో, ఈటె గుండెలోకి దిగుతుంది, జాగ్రత్త!" అన్నాడు.

అ వెంటనే భయంకరపక్షి రివ్వున గాలిలోకి లేచింది. ఉగ్రదత్తుడు అ ఊపుకు పక్షి మీద అటూ యిటూ వూగిస లాడుతూ, "సమయం మించిపోయింది. ఈ క్రూరులు మమ్మల్ని జ్వాలాద్వీపం తీసుకుపోతున్నారు," అనుకున్నాడు.




చూస్తూండగానే భయంకర పక్షులు అకాశంలోకి చాలా ఎత్తు ఎగిరి మేఘాల మీదుగా తూర్పుదిశకేసి పోసాగినై. పక్షుల వేగానికి గాలి రివ్వురివ్వుమంటూ ఉగ్ర దత్తుణ్ణి తాకసాగింది. అతడు పక్షి వెన్ను మీద అటూయిటూ ఒరుగుతున్నాడు. జారి కిందికి పడిపోకుండా ఒక పులిరాయుడు అతడి నడుం గట్టిగా పట్టుకున్నాడు.

ఇలా కొద్దికాలం జరిగింది. పక్షులు క్రమంగా కిందికి దిగుతున్నట్టు ఉగ్ర దత్తుడికి తోచింది. గాలి హఠాత్తుగా వేడెక్కి పోయింది. శరీరాన్ని ఏవో మంటలు తాకు తున్నట్టుగా అతడు భ్రమపడ్డాడు. అంతలో, "శత్రువులు! భల్లూకరాయుళ్లు! చంద్రసేనా, ఇతర బంధితులు వున్న పక్షుల్ని జాగర్తగా కిందికి చేర్చండి. తతిమ్మావాళ్ళు భల్లూకరాయుళ్ళను ఎదుర్కొండి!" అన్న కేక వినబడింది.

"ఓహో! జ్వాలాద్వీపంలో కూడా రెండు శత్రు పక్షాలున్నవన్న మాట!" అనుకున్నాడు ఉగ్రదత్తుడు. ఈ సంగతి తెలియగానే అతడికి ఎక్కడలేని ఉత్సాహం కలిగింది. కాని, వాళ్ళూ వాళ్ళూ భయంకర పక్షుల మీద అకాశంలో చేసే యుద్ధంలో, నేనూ, నా మిత్రులూ కిందపడి ముక్కలు ముక్కలై మరణించం గదా? అన్న భయం కూడా అతడికి కలిగింది.

హఠాత్తుగా ఉగ్రదత్తుడున్న భయంకర పక్షి మెడసాచి భూమి మీదికి వేగంగా దిగసాగింది. ఉగ్రదత్తుడు తల ఎత్తి పైకి చూశాడు. ఎలుగొడ్డు చర్మాలు ధరించి, పెద్ద పెద్ద ఈటెలు పట్టుకుని వున్న కొందరు, తాము ఎక్కివున్న భయంకర పక్షులను పులిరాయుళ్ల మీదికి ఉసికొల్పు




తున్నారు. చూస్తూండగానే ఆకాశంలో పులిరాయుళ్ళకూ భల్లూకరాయుళ్ళకూ భయంకర యుద్ధం ప్రారంభమయింది. ఈటె దెబ్బలు తిని, బాధతో మూలుగుతూ కొందరు రౌతులు పక్షుల మీది నుంచి కిందికి పడసాగారు. రౌతులను కోల్పోయిన పక్షులు, రెక్కలు టపటపలాడిస్తూ, కేకలు పెడుతూ అన్ని దిక్కులకూ పారిపోతున్నవి.

ఇంతలో ఉగ్రదత్తుడున్న పక్షి ఒక కొండ పైభాగాన దిగింది. ఆ పక్షి మీద వున్న ఇద్దరు పులిరాయుళ్లూ కిందికి దిగి, ఉగ్రదత్తుణ్ణి పక్షి మీది నుంచి ఎత్తి, చాప చుట్టను పారవేసినట్టు కిందికి విసిరివేశారు. అదృష్టవశాత్తూ అతడు ఎత్తుగా పెరిగిన పచ్చగడ్డీ, దుబ్బుచెట్లూ వున్న చోట పడటంతో, శరీరానికి పెద్ద గాయాలేమీ తగలలేదు. కాని, అతడికి ప్రాణం కడబట్టినంత పనయింది.

ఒక పులిరాయుడు అతణ్ణి సమీపించి కాలితో అటూయిటూ కదిలించి చూస్తూ, "వీడు చచ్చినట్టున్నది!" అన్నాడు. అందుకు రెండవ పులిరాయుడు పెద్దగా నవ్వి, "వీడు బతికివున్నా, చచ్చినా మనకు ఒకటే. రాజకుమార్తె సురక్షితంగా మన నాయకుడి భవనం చేరింది. వీడి సంగతి తరవాత చూద్దాం. ముందు కంధుడి అనుచరుల పని తేల్చాలి, రా," అంటూ భయంకర పక్షి కేసి పరిగెత్తాడు.

పులిరాయుళ్ళ సంభాషణ ఆలకిస్తూ, ఉగ్రదత్తుడు కదలా మెదలక వూరుకున్నాడు. తను బతికి వున్నట్టు వాళ్ళకు అనుమానం కలిగితే, ఒకవేళ వాళ్ళు తనను చంపవచ్చు. కంధుడనేవాడు ఈ పులిరాయుళ్ళకు శత్రువులైన భల్లూకరాయుళ్ళకు నాయకుడు. సామంతరాజు సుదర్శనుడి కుమార్తె చంద్రసేనను పులిరాయుళ్ళు క్షేమంగా తమ నాయకుడి, ఇంటికి చేర్చారు.

తన కాళ్లూ చేతుల్ని కట్టివున్న తాళ్లను తెగగొట్టుకునేందుకు ఉగ్రదత్తుడు గట్టి



ప్రయత్నం చేశాడు. కాని, అతడి పెనగులాటవల్ల తాళ్ళు మరింతగా బిగుసుకుపోయి, ఎక్కడ లేని బాధా కలిగించినై. ''ఇక నేను చేయగలిగిందేమీ లేదు. ఎవరైనా వచ్చి నన్ను రక్షించవలసిందే. బహుశా రుద్రారుద్రులు కూడా నేనున్న నిస్సహాయ స్థితిలోనే వుండి వుంటారు,'' అనుకున్నాడు ఉగ్రదత్తుడు నిస్పృహగా.

ఆకాశంలో మరో పావుగంట కాలం ఇరుపక్షాల మధ్య భయంకర యుద్ధం సాగింది. చివరకు కొన్ని పక్షులు పడమటి దిక్కుగా పారిపోతూండటం, వాటిని తరుముతూ మరికొన్ని వెళ్ళటం ఉగ్రదత్తుడు చూశాడు.

సూర్యుడు క్రమంగా ఆకాశం మధ్యకు వచ్చాడు. ఎండ తీవ్రమయింది. ఉగ్రదత్తుడి నాలుక దాహంతో పిడచకట్టుకుపోసాగింది.

''ఆకలితో, దాహంతో బాధపడి నేనిక్కడ మరణించక తప్పదు,'' అనుకున్నాడు ఉగ్రదత్తుడు. తనను అక్కడ వదిలిపోయిన శత్రువులు వచ్చినా, తన ప్రాణానికి కొంత రక్షణ కలగవచ్చున్న భావం అతడికి కలిగింది. వాళ్ళు తన సంగతే మరిచిపోయారా? లేక భల్లూకరాయుళ్ళతో జరిగిన యుద్ధంలో మరణించారా?

ఉగ్రదత్తుడు యిలా మథనపడుతూన్నంతలో, పక్కనే వున్న చెట్లలో ఏదో అలికిడి అయినట్టు అతడికి అనుమానం కలిగింది. ఉన్నచోటు నుంచి, ఆ ధ్వని వచ్చిన వైపుకు పొర్లి, చెట్లలోకి పరీక్షగా చూశాడు. అక్కడ కనిపించిన దృశ్యం అతడికి భీతి కలిగించింది. నిలువెల్లా వణికిపోయాడు.

రెండు తోడేళ్ళు చెట్లచాటున నిలబడి అతడి కేసి చూస్తూ డొక్కలు ఎగరవేస్తున్నవి, నాలుకలు చాస్తున్నవి. అతడిలో యింకా జీవం వున్నదా, లేక మరణించాడా అన్న సంశయంలో అవి కొట్టుమిట్టాడుతున్నట్టు ఉగ్రదత్తుడికి తోచింది. తను

నిస్సహాయ స్థితిలో వున్నట్టు అవి గ్రహిస్తే, తన మీదకు తప్పక లంఘించి తీరుతవి.

ఉగ్రదత్తుడు ఎక్కడ లేని సత్తువా తెచ్చుకుని, మోచేతుల బలంతో నేల మీది నుంచి కొంచెం లేచి, పెద్ద గొంతుతో కేక పెట్టాడు. ఆ కేక వింటూనే తోడేళ్ళు చెట్లల్లోకి పారిపోయినై. ప్రస్తుతానికి ఆపద గడిచింది, అనుకుని ఉగ్రదత్తుడు పెద్దగా నిట్టూర్చాడు.




సూర్యుడు క్రమంగా పడమటి దిక్కుకు దిగి కొండ శిఖరాల వెనుకకు పోయాడు. ఉగ్రదత్తుడున్న ప్రదేశం కొంచెం కొంచెమే చల్లబడసాగింది. అతడికిప్పుడు దాహంతో పాటు ఆకలి కూడా ప్రారంభమయింది. ఏదో మత్తులాటిది తన శరీరాన్ని కమ్ముకుంటున్నట్టు అతడు భావించాడు. మైకంలో వుండగా తోడేళ్ళు తప్పక నన్ను కబళించగలవు అనుకున్నాడు ఉగ్రదత్తుడు. కాని, మెలకువగా వుండాలన్న అతడి ప్రయత్నం వృథా అయింది. అతడు మగతనిద్రలోకి జారుకున్నాడు.

ముఖాన్నీ, నడుమునూ ఏవో బలమైన గోళ్ళు తాకినట్టయి ఉగ్రదత్తుడు ఉలిక్కిపడి లేచాడు. ఆ మరుక్షణం దూరంగా కేకలు వినిపించినై. ఉగ్రదత్తుడు కూడా అప్రయత్నంగా కీచుమని అరిచాడు. మసక వెలుతురులో అతడికి తన మీది నుంచి కుప్పించి ఎగిరి అల్లంత దూరంలో వున్న చెట్లలోకి పారిపోతున్న నల్లని ఆకారం ఒకటి కనిపించింది. అది ఎలుగుబంటి!

ఉగ్రదత్తుడు నిశ్చేష్టుడయాడు. ఎవరో దూరం నుంచి వేసిన కేకలు విని, భయపడి ఎలుగు తనను హాని చేయకుండా పారిపోయింది. ఆ కేకలు పెట్టినవాళ్ళు ఎవరై వుంటారు?

"ఇదుగో, రండి, రండి. ఇక్కడ పొదల మధ్య పడివున్నాడు. ఎలుగుబంటి భయపడి పారిపోయింది," అంటూ ఒకడు ఉగ్రదత్తుడి దగ్గిరకు పరిగెత్తుకు వచ్చాడు.

అతడి చేతిలో పెద్ద ఈటె ఒకటి వున్నది. వాడు ఎలుగుబంటి చర్మాలు ధరించి వున్నాడు.

ఉగ్రదత్తుడు మూలుగుతూ తల ఎత్తి, "ఈ కట్లు విప్పండి. దాహం తీర్చుకునేందుకు నీరు ఏమైనా వుంటే యివ్వండి," అని అడిగాడు బొంగురుపోయిన గొంతుతో.

భల్లూకరాయుడు మారు మాటాడకుండా ఉగ్రదత్తుడి కట్లు విప్పసాగాడు. ఇంతలో మరిద్దరు భల్లూకరాయుళ్లు అక్కడికి వచ్చారు. వాళ్ళల్లో ఒకడి దగ్గిర భుజానికి వేలాడుతున్న సొరకాయబుర్ర వున్నది. ఉగ్రదత్తుడు దాని కేసి వేలు చూపుతూ, దాహం అని సౌంజ్ఞ చేశాడు. భల్లూకరాయుడు సొరకాయ బుర్రకు వున్న బెండును వూడదీసి, బుర్రను ఉగ్రదత్తుడి నోటికి అందించాడు. ఉగ్రదత్తుడు ఆత్రంగా గటగట నీరు తాగి, యిక చాలునన్నట్టు తల ఆడించాడు.

దాహం తీర్చుకోవటంతోనే ఉగ్రదత్తుడికి ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. ఇంతలో అతడి కాళ్ళకూ, చేతులకూ వున్న కట్లు కూడా విప్పబడినై. ఉగ్రదత్తుడు కాళ్ళూ, చేతులను అటూ యిటూ సాగదీసుకున్నాడు. వాటిల్లో రక్తప్రసారం తిరిగి ప్రారంభమై, అవి స్వాధీనానికి వచ్చినై.

"లేచి నడవగలవా?" అని ఒక భల్లూకరాయుడు అతణ్ణి అడిగాడు.

"మీరు శత్రువులా, మిత్రులా?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

"ఆ సంగతి నువ్వు మా నాయకుడికిచ్చే జవాబులను బట్టి ఆయనే నిర్ణయిస్తాడు." అన్నాడు భల్లూకరాయుడు.

"సరే, పదండి!" అంటూ ఉగ్రదత్తుడు లేచి నిలబడ్డాడు. భల్లూకరాయుళ్ళు ముగ్గురూ అతణ్ణి వెంటబెట్టుకుని, చెట్లల్లో కొంతదూరం నడిచి, ఎగుడు దిగుడుగా వున్న కొండరాళ్ళ మధ్య గల ఒక బల్లపరుపు రాతిని ఎత్తి, బిలం లోపలకు దిగి, తిరిగీ రాతిని ఎప్పటిలా జాగ్రత్తగా మూసేశారు. —(ఇంకావుంది)






# ధైర్యవంతుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, ఈ శ్మశానంలో నువ్వు పడుతున్న శ్రమకు కారణం, ప్రాణభీతా లేక మొక్కవోని ధైర్యసాహసాలా అన్న అనుమానం నాకు కలుగుతున్నది. ఎందుకంటే, ఒక్కొక్కసారి ఎంత భీరువు అయినవాడు కూడా, ప్రాణరక్షణకోసం ఎక్కడలేనిధైర్యసాహసాలుప్రదర్శిస్తాడు. ఇందుకు ఉదాహరణగా, ఒక కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ యిలా చెప్పసాగాడు:

బ్రహ్మపురం అనే గ్రామంలో రాముడు, భీముడు అనే యిద్దరు స్నేహితులుండేవారు. చిన్నతనం నుంచీ రాముడిది

## బేతాళ కథలు



మెత్తటిమనసు. పెద్దల మాటలకు ఎదు రాడేవాడు కాదు. భీముడు మాత్రం మహా దుడుకుమనిషి.

ఒకసారి, ఆ గ్రామానికి కత్తి యుద్ధంలో నైపుణ్యం గల ఖడ్గయోధు డనే వాడొక డొచ్చి, తన విద్యను ప్రదర్శించి, గ్రామస్థుల మెప్పుపొందాడు. గ్రామంలోని యువకులు కొందరు, ప్రదర్శన కోసం వాడితో కత్తి యుద్ధం చేసి, ఓడిపోయారు. అలా ఓడినవారిలో రాముడు, భీముడూ కూడా వున్నారు.

ఖడ్గయోధుడు తన ప్రదర్శన ముగిశాక, రాముడిని ఎంతగానో మెచ్చుకుని, "నీలో కత్తి పట్టుకునే ఒడుపు వుంది. నీ కదలి కల్లో, మంచి వీరుడి లక్షణాలున్నాయి. నిన్ను, నా శిష్యుడిగా చేసుకుని, నా అంత వాణ్ణి చేస్తాను. నీ లాంటి వీరుడి కోసం అన్వేషిస్తూ, నేను, ఊరూరా ప్రదర్శన లిస్తున్నాను," అన్నాడు.

రాముడు, ఖడ్గయోధుడికి శిష్యుడయేందుకు ఉత్సాహపడ్డాడు. కాని, వాని తల్లిదండ్రులు అందుకు ఒప్పుకోలేదు. భీముడికి, ఖడ్గయోధుడి శిష్యుడు కావాలని వున్నది. ఇందుకు ఖడ్గయోధుడు అంగీకరించలేదు.

"నీ అదృష్టం గొప్పది. పెద్దల మాట పట్టించుకోకు. వచ్చిన అవకాశాన్ని జారవిడవకు," అని భీముడు, రాముడికి చెప్పి చూశాడు.

రాముడు, భీముడి మాటలు వినలేదు.

కొన్నాళ్ళు గడిచాక, బ్రహ్మపురానికి కావ్యయోగు డనే కవి వచ్చి, తన విద్యా ప్రదర్శనతో గ్రామస్థులను మెప్పించాడు. ఆయన కొందరు యువకులతో ప్రశ్నలు వేయమని చెప్పి, ఆ ప్రశ్నలకు జవాబులన్నీ పద్యాల రూపంలో చమత్కారంగా చెప్పాడు.

ఆయన కూడా రాముడంటే ముచ్చటపడి, తన శిష్యుణ్ణి చేసుకుంటానన్నాడు. తల్లిదండ్రులు కాదనడంతో, రాముడు అందు కంగీకరించలేదు.



ఆ తర్వాత బ్రహ్మపురానికి వచ్చిన, ఒక సంగీత విద్వాంసుడు కూడా, రాముణ్ణి మెచ్చుకుని శిష్యుడుగా చేసుకోవాలను కున్నాడు. కాని, రాముడి తల్లిదండ్రులు ఒప్పుకోలేదు.

ఊరుకు వచ్చిన గొప్పవాళ్ళందరూ, యీ విధంగా రాముణ్ణి మెచ్చుకోవడంతో, భీముడి చెల్లెలు పార్వతికి, వాడంటే ఎంతో అభిమానం ఏర్పడి అతణ్ణి పెళ్ళి చేసు కుంటానన్నది. ఈ సంగతి రాముడు, తల్లిదండ్రులకు చెప్పుకున్నాడు. అయితే వాడి తల్లిదండ్రులు పార్వతితో పెళ్ళికి ఒప్పుకోలేదు.

భీముడికి, ఈ సంగతి తెలిసి, ముందుగా రాముణ్ణి కలుసుకుని, "నీ తల్లిదండ్రుల సంగతి అలా వుంచు. నా చెల్లెలంటే, నీ కిష్టమేనా ?" అని అడిగాడు.

"ఇష్టమే కానీ, నా తల్లిదండ్రులు ఒప్పుకుంటే తప్ప, యీ పెళ్ళి చేసుకోను." అన్నాడు రాముడు.

భీముడు, రాముడి తల్లిదండ్రులను కలుసుకుని, "నా చెల్లెల్ని, మీ యింటి కోడలిగా ఎందుకు చేసుకోరు ?" అని అడిగాడు.

"నీకున్న ఇల్లూ, పొలం యిచ్చేస్తే, ఈ పెళ్ళి జరుగుతుంది," అన్నాడు రాముడి తండ్రి.

"ఇంతేనా !" అని భీముడందుకు అంగీకరించాడు.

రాముడికి, పార్వతితో పెళ్ళి జరిగి పోయింది.

భీముడు తన ఇంట్లోనే వుంటూ, ఆ ఇంటికి అద్దె చెల్లించేవాడు. తన పొలాన్నే సాగుచేస్తూ, తను కూలిడబ్బులు మాత్రం తీసుకుని, మిగతా పంటనంతా, రాముడి తల్లిదండ్రుల కిచ్చేవాడు.

ఇది చూసి భీముడి చెల్లెలు పార్వతి ఎంతో బాధపడుతూండేది. భర్తకేం చెప్పినా లాభం లేదని, అత్తమామలతోనే గొడవపడుతూండేది. అందువల్ల కూడా ప్రయోజనం ఏమీ కలగలేదు.



ఇలా కొన్నేళ్ళు గడిచేసరికి, రాముడి తల్లిదండ్రులు బాగా ముసలివాళ్లయ్యారు. ఇంటి పెత్తనం పార్వతి చేతికి వచ్చింది. అన్నగారి ఇల్లూ, భూమీ తిరిగి అతడి పరం చేయాలని పార్వతి అనుకున్నది. కాని, భీముడు అందు కంగీకరించలేదు. పార్వతి చేసేదిలేక, తన కోపాన్నంతా, అత్తమామలపై చూపిస్తూండేది. భీముడి కది తెలిసి, వెళ్ళి చెల్లెల్ని గట్టిగా మందలించాడు.

"నా ఇంట్లో, నా యిష్టం వచ్చినట్లుంటాను. నువ్వు పరాయివాడివి! ఈ విషయంలో నీ సలహాలు నాకక్కర్లేదు," అన్నది పార్వతి కోపంగా.

భీముడు చిన్నబుచ్చుకుని, చెల్లెలి నేమీ అనలేక, రాముడితో, "వృద్ధులైన నీ తల్లిదండ్రుల మీద కక్ష సాధించడం తప్పని, నీ భార్యకు చెప్పు," అన్నాడు.

"ఆ పని నావల్ల కాదు," అన్నాడు రాముడు.

ఇలా వుండగా, ఆ ప్రాంతాల వరసగా రెండు సంవత్సరాలు వానలు కురవక, కరువుపరిస్థితులు ఏర్పడినై.

పార్వతి భర్తతో, "ఇంటి వ్యవహారాలు, నేను చూసుకోగలను. నీకెన్నో విద్యలు తెలుసు. నువ్వూ, మా అన్నా కలిసి రాజధానికి వెళ్ళి, రాజుగారి కొలువులో, ఏదైనా ఉద్యోగం సంపాయించండి," అన్నది.

రాముడూ, భీముడూ గ్రామం వదిలి బయల్దేరారు. వాళ్ళ అదృష్టం కొద్దీ, మార్గమధ్యంలోనే, వేటకు వచ్చిన రాజుగారి గుడారం వాళ్లకు కనిపించింది. భీముడు, రాజును దర్శించి తమను గురించి చెప్పుకున్నాడు.

"నా కొలువులో ధైర్యవంతులకు తప్ప మరెవ్వరికీ స్థానం లేదు. మీ ధైర్యాన్ని పరీక్షించడానికి ఒప్పుకుంటారా?" అని అడిగాడు రాజు.

రాముడూ, భీముడూ యిందుకు అంగీకరించారు.

"మాట తప్పకూడదు!" అని హెచ్చరించాడు రాజు.

"తమరీ దేశానికి ప్రభువులు. తమకిచ్చిన మాట తప్పుతామా!" అన్నాడు భీముడు.

రాజు అప్పుడు, భటులచేత రెండు బోనులు తెప్పించాడు. రెండింటిలోనూ ఆకలిగొన్న పులులున్నాయి.

"వేటలో వీటిని పట్టుకున్నాం. నాలుగు రోజులుగా వీటికి ఆహారం లేదు. మీ యిద్దరూ నిరాయుధులుగా బోనుల్లో ప్రవేశించి, పులులతో పోరాడి, మీ ధైర్యాన్ని నిరూపించండి!" అన్నాడు రాజు.



"ప్రభూ, యిది చాలా అన్యాయం! ధైర్యమంటే, ప్రాణాలు కాపాడుకునేందుకేగాని, పోగొట్టుకునేందుకు కాదు. ఆకలిగొన్న పులితో పోరాడడం, ఆత్మహత్యతో సమానం," అన్నాడు భీముడు.

రాజు, రాముడి వంక కోపంగా చూస్తూ, "మరి, నువ్వేమంటావు? నీ ధైర్యాన్ని నిరూపించుకుంటావా? రాజాజ్ఞను ధిక్కరిస్తావా?" అని అడిగాడు.

"ప్రభూ, నేను పులితో పోరాడతాను." అన్నాడు రాముడు.

రాజు ఆశ్చర్యపడి, "నువ్వు ధైర్యవంతుడివి. వెళ్ళు, బోను తలుపు తెరిచి, లోపల ప్రవేశించు." అన్నాడు.

రాముడు ముందుకు వెళుతూంటే, భీముడు వాడికి అడ్డంగా నిలబడి, రాజుతో, "ప్రభూ, ఈ రాముడి సంగతి మీకు తెలియదు. వాడు ధైర్యవంతుడు కాడు. తల్లిదండ్రులను ఎదిరించే ధైర్యం లేక, వాడెన్నో విద్యలకు దూరమయ్యాడు. భార్యను అదుపులో పెట్టే ధైర్యం లేక, వాళ్ళను అష్టకష్టాలకు గురి చేసి, మీ కొలువులో ఉద్యోగ సంపాదనకు బయల్దేరాడు. ఇప్పుడు మీ ఆజ్ఞను కాదనే ధైర్యం లేక, తన ప్రాణాలనే బలిపెడుతున్నాడు. వీడు పోతే, నా చెల్లెలి గతేంకాను! దేశాన్నేలే రాజుకు, పౌరుల ప్రాణాలతో ఆటలాడడం తగదు. మీ కొలువుకు, ఒక

నమస్కారం. మా ఇద్దరినీ యింతటితో వదిలిపెట్టండి," అన్నాడు.

భీముడి మాటలకు రాజు చిన్నగా నవ్వి, అతడి భుజం తట్టి, "నిజమైన ధైర్యవంతుణ్ణి, మొదటిసారిగా చూశాను. ఈ రోజు నుంచీ, నా కొలువులో, నీతో పాటు నీ బావమరిదికి కూడా ఉద్యోగం యిస్తున్నాను," అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఇందులో రాముడి ప్రవర్తనే కాక, రాజు ప్రవర్తన కూడా, నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది. రాముడు పరమ పిరికివాడన్న సంగతి, మొదటి నుంచీ స్పష్టంగా తెలుస్తూనే వున్నది. అలాంటివాడు, ఆకలిగొన్న పులితో పోరాడడానికి ఎందుకు సిద్ధపడ్డాడు? రాజు వాణ్ణి ధైర్యవంతుడని మెచ్చుకోక, పులితో పోరాడ నిరాకరించిన భీముణ్ణి, నిజమైన ధైర్యశాలివని ఎందుకన్నాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఖడ్గవీరుడి నుంచి, రాజువరకూ జరిగిన ప్రతి సంఘటనలోనూ, రాముడి ప్రవర్తనలో పిరికితనమే స్పష్టంగా బయటపడుతున్నది. వాడికి ఏమాత్రం స్వబుద్ధి అంటూ లేదు. ఆత్మీయులు గాని, లేక అధికారం చలాయించగలవాళ్ళు గాని, ఏది చెబితే అది చేయడం, వాడి స్వభావం. అందు వల్లనే, వాడు రాజాజ్ఞను ధిక్కరించే ధైర్యం లేక, పులితో పోరుకు సిద్ధపడ్డాడు. భీముడు అలా కాదు. తనకు యిష్టం లేని పని ఎవరు చెప్పినా, వాడు ధైర్యంగా వాళ్ళను ధిక్కరించగలడు. వాడు రాజాజ్ఞను ధిక్కరించడమే కాక, ధైర్యంతో అయనకు హితబోధ కూడా చేశాడు. ఇది గ్రహించడం వల్లనే, రాజు వాణ్ణి నిజమైన ధైర్యశాలివంటూ మెచ్చుకున్నాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# తెలివైన తీర్పు

సువర్ణగిరిని పాలించే సుందరవర్మ, ధర్మ మూర్తి అనీ, న్యాయనిర్ణయంలో, ఆయనకు ఆయనే సాటి అనీ, అందరూ చెప్పుకునేవాళ్ళు. సుందరవర్మ ప్రతి సమస్యనూ సునిశితంగా పరిశీలించి, తన బుద్ధి కుశలతతోనే, ఉపాయంతోనే చక్కగా పరిష్కరించేవాడు.

ఒక రోజున రాజభటులు, యిద్దరు వ్యక్తులను సభకు తీసుకువచ్చి, తమతో తెచ్చిన ఒక డబ్బు సంచిని, రాజుకు చూపుతూ, వాళ్ళిద్దరూ ఆ సంచికోసం వాదులాడుకుంటున్నారని విన్నవించారు.

సుందరవర్మ, వాళ్ళిద్దరి కేసీ ఒకసారి చూశాడు. ఆయనకు, వాళ్ళిద్దరిలో దొంగ ఎవరో తెలుసుకోవడం, అంత సులభం కాదని తోచింది.

ఆయన కొద్దిసేపు ఆలోచించి, ఏదో నిశ్చయానికి వచ్చినట్టు తల పంకించి, గంభీరమైన స్వరంతో, "మీలో ఆ సంచి ఎవరిదో, వాడు ధైర్యంగా వచ్చి, దానిని తీసుకోండి," అన్నాడు.

ఆ వెంటనే, ఆ ఇద్దరిలో ఒకడు ముందుకు వచ్చి, ఆ డబ్బు సంచిని తీసుకున్నాడు.

సుందరవర్మ, ఆ సంచి అతడిదేనని తీర్పు యిస్తూ, రెండవవాడిని దొంగగా నిర్ణయించి, భటులకు, వాణ్ణి కారాగారంలో వెయ్యమని ఆజ్ఞయిచ్చాడు.

డబ్బు సంచీ తీసుకున్నవాడు, రాజుకు వినయంగా నమస్కరించి, అక్కడినుంచి వెళ్ళిపోయాడు. రెండవవాణ్ణి, భటులు బంధించి తీసుకుపోయారు.

రాజు తీర్పుకు, సభికులతోపాటు, మంత్రి కూడా ఆశ్చర్యపోయాడు. ఆయన, రాజును, "ప్రభూ, తమరు దొంగను ఎలా పట్టగలిగారు ?" అని అడిగాడు.

దాసరి వెంకటరమణ

అందుకు సుందరవర్మ, "దొంగను పట్టుకోవడానికి, ఒక చిన్న పరీక్ష పెట్టాను. ఆ సంచికోసం, యిద్దరూ వాదులాడుకుంటున్నారు గదా. నేను, ఆ సంచి ఎవరిదో తీసుకోమనగానే, యిద్దరూ ముందుకు రావలసింది. కాని, ఆ దొంగ కాస్త అతి తెలివి చూపించాడు. ఆతృతగా ముందుకు వచ్చినవాణ్ణి దొంగగా భావించి, తనకు సంచి యిస్తారని వాడనుకున్నాడు. అందువల్లనే, కదలకుండా వుండిపోయాడు. దాని అసలు యజమాని ధైర్యంగా ముందుకు వచ్చి, దాన్ని తీసుకున్నాడు," అని చెప్పాడు.

రాజు చెప్పినది సభలోని వాళ్ళకు అంత తృప్తికరంగా కనిపించలేదు.

ఇది గమనించిన సుందరవర్మ, ఒకసారి సభికుల కేసి చూసి, మంత్రితో, "మీరింకా ఏదో సంశయంలో వున్నట్టున్నారు!" అన్నాడు.

"అవును, ప్రభూ!" అన్నాడు మంత్రి వినయంగా.

రాజు చిన్నగానవ్వి, "అదేమిటో చెప్పండి," అని అడిగాడు.

"ఒకవేళ, మీరూహించినది పొరబాటై, యిప్పుడు మీరు కారాగారానికి పంపినవాడిదే, ఆ డబ్బు అయి వుండవచ్చుగదా. కాదనడానికి ఖచ్చితమైన ఋజువేమిటి? సెలవివ్వండి!" అన్నాడు మంత్రి.

"అవును, మీరడగవలసిన ప్రశ్నే అడిగారు," అని సుందరవర్మ, ఒకక్షణం ఆగి, "నేను కారాగారానికి పంపినవాడే, ఆ సంచి యజమాని అయివుంటే—తను సంపాయించిన ధనం, తన కళ్ళముందే ఎవడో దొంగవాడి పరమవుతూంటే, అన్యాయం జరిగిపోతున్నదంటూ, మొత్తుకునేవాడు. వాడు నిజంగా దొంగ కావడం వల్లనే, నాకేదో విధంగా నిజం తెలిసి, తన దొంగబుద్ధి బయటపడిందని, మౌనంగా వెళ్ళిపోయాడు," అని చెప్పాడు.

రాజు సునిశితబుద్ధికీ, న్యాయ నిర్ణయానికీ, సభలోనివారంతా కరతాళధ్వనులు చేశారు.



మనదేశపు అద్భుతాలు :

# అంబర్‌కోట

రాజస్థాన్‌లోని జైపూర్ నగరానికి సమీపంలో అంబర్‌కోట ఉన్నది. అంబర్‌కోట ఒకప్పుడు ఢుండార్ రాజ్యానికి రాజధానిగా ఉండేది. బ్రహ్మాండమైన కుడ్యాలతో, గుమ్మటాలతో, క్లిష్టమైన రహస్య మార్గాలతో, శిల్పస్తంభాలతో వెలసే ఈ చలువరాతి భవనం కొండ సానువుల మీద వెలుగొందుతున్నది.






మొట్టమొదట ఈ ప్రాంతాన్ని పరిపాలించిన మీణాలు శక్తిస్వరూపిణి అయిన అంబను ఆరాధించేవారు. ఆ కారణంగా ఈ ప్రాంతం అంబావతి అని పిలువబడేది. క్రమేణా అంబావతి, అంబర్‌గా రూపాంతరం చెందింది. దురాక్రమణదారుల దాడికి గురికాకుండా, కొండ సానువుల మీద భవన నిర్మాణం జరిగింది.

పదవశతాబ్దంలో, గ్వాలియర్ రాణి, తన పసికందును రక్షించుకోడానికి, పల్లెటూరి స్త్రీ వేషంతో బిడ్డను గంపలో కెత్తుకుని, అంబర్‌కు బయలుదేరింది.





అంబర్ సమీపంలోని ఖొగాన్ సమీపించగానే రాణికి విపరీతంగా ఆకలి, దాహం వేశాయి. ఆమె తల మీది గంపను ఒక బండపై దించి, పక్కన ఉన్న పళ్ళు కోసుకుని, తిరిగి వచ్చి, అక్కడి దృశ్యాన్ని చూసి నిలువెల్లా కంపించిపోయింది. ఒక నల్లత్రాచు పడగవిప్పి, బిడ్డకు నీడ పడుతున్నది! రాణిని చూడగానే పాము అక్కడి నుంచి మెల్లగా వెళ్ళిపోయింది.

దూరం నుంచి ఈ దృశ్యాన్ని చూసిన బ్రాహ్మణు డొకడు, ఆ బిడ్డ రాజు కాగల డని రాణికి చెప్పాడు. ఆమె అంబర్ రాజు ఇంట వంటమనిషిగా చేరింది. ఆమె చేసిన రుచికరమైన వంటలు ఆరగించి, రాజు ఆమె ఎవరైనదీ గ్రహించాడు. అప్పటి నుంచి రాజు ఆమెను తన తోబుట్టువులా చూసుకో సాగాడు!





రాణి కుమారుడు పెరిగి పెద్దవాడై ధోలా రాయ్ నామంతో రాజ్యసింహాసనాన్ని అధిరోహించాడు. కాని, కొన్నాళ్ళకు, మీణాలు అతణ్ణి హతమార్చారు. ఆ తరవాత ఎందరో రాజులు రాజ్యం ఏలారు. క్రమక్రమంగా అంబర్ కోట ప్రాంగణం విస్తృతమవుతూ, నిర్మాణం కొనసాగుతూనే వచ్చింది.

రెండవ జైసింగ్ రాజు (1699-1745) జైపూర్ పట్టణ నిర్మాణంతో, రాజధానిని నూతన నగరానికి మార్చడానికి ప్రారంభించాడు. మొగలు రాజు షా ఆలం ఒకసారి అంబర్ కోటపై దాడిజరిపాడు. కాని జైసింగ్ సైనికులు మొగలు సేనలను తరిమికొట్టారు!






మధ్యయుగ భారతీయ శిల్ప కళకు చక్కటి తార్కాణంగా జైగర్ కొండ సానువుల మీద వెలుగొందుతున్న అంబర్ కోట ఎన్నో విశిష్టతలను సంతరించుకున్నది. వాటిలో—సూర్య కాంతిని, చంద్రకాంతిని ప్రతిఫలించే సూరజ్ పోల్—చాంద్‌పోల్ ద్వారం ప్రధానమైనది.

ఒకేవరుస చలువరాతి స్తంభాలతో వెలసే సువిశాలమైన చతురస్రాకార దివాన్-ఇ-ఆమ్ అనే బ్రహ్మాండమైన మంటపాన్ని మొదటి జైసింగ్ నిర్మించాడు. ఈ రకం భవనాలలో ఇది ఎంతో విలక్షణమైనది. ఈ భవన సౌందర్యం చూసి, షాజహాన్ చక్రవర్తి సైతం అసూయ చెందినట్టు చెబుతారు.





అంబర్ కోటకు సుసంపన్నమైన ఎంతో చరిత్ర ఉన్నది. ఈనాడు కూడా, వారం వారం వేలాది యాత్రీకులను ఆకర్షిస్తున్నది. కోట ప్రాంగణంలోనే ఏనుగుసవారీ వసతి కల్పించబడి ఉన్నది. మనదేశపు అద్భుత భవనాలలో ఈ కోట సమున్నతస్థానాన్ని ఆక్రమిస్తున్నది!




నార్వేదేశంలోని ఒక పట్టణంలో ఒక ధనికుడికి ఇద్దరు కొడుకు లుండేవాళ్ళు. ఆ ధనికుడికి సముద్రం మధ్యలో ఒక దీవి ఉండేది. వేసవిలో అక్కడ ధనికుడి కొడుకులు చేపలవేట సాగించేవాళ్ళు. వాళ్ళ కోసం అక్కడ ఒక ఇల్లు కూడా ఉండేది.

ధనికుడి కొడుకులలో పెద్దవాడు గంభీర స్వభావం కలవాడు. అతని ఆలోచనలు ఎవరికీ తెలిసేవి కావు. రెండోవాడు అన్నకు విరుద్ధంగా ఉండేవాడు. సాహసమైన పనులు చేసేవాడు. "నేను సుడిగల వాణ్ణి" అనేవాడు. తన సాహసం వల్ల నష్టం కలిగినా లక్ష్యపెట్టేవాడు కాడు.

ధనికుడు చనిపోయాక మిగతా ఆస్తితో పాటు, సముద్రంలో ఉన్న దీవి కూడా అన్నదమ్ములకు వచ్చింది. వాళ్లు భాగాలు పడలేదు. ప్రతి వేసవికీ పడవలో దీవికి వెళ్ళి; అక్కడ కొన్నాళ్ళు చేపలవేట సాగించి, వానలు జాస్తి అయే సమయానికి తిరిగి వచ్చేవాళ్ళు; వాళ్ళ దీవిని చలి కాలంలో రకరకాల మరుగుజ్జుల జాతుల వాళ్ళు ఉపయోగించుకుంటారని పుకారు ఒకటి ఉండేది.

ఒక ఏడు అన్నదమ్ము లిద్దరూ దీవిలో చేపలు పట్టి తిరిగి వచ్చిన కొద్ది రోజులకు, దీవి మీద కొంత సామాను దిగబడిపోతే, దాన్ని తీసుకురావటానికి పడవలో వెళ్లారు. వాళ్ళు తిరిగి బయలుదేరే వేళకు సూర్యాస్తమానమయింది.

అన్న తమ్ముడితో, "మనం ఈ పూట తిరిగి పోవద్దు. ఈ రాత్రి తుపాను వచ్చేటట్టుంది. రేపు ఉదయం బయలు దేరుదాం," అన్నాడు.

"తుపాను రాదు, ఏమీ రాదు. మనం బయలుదేరుదాం పద!" అన్నాడు తమ్ముడు.

నార్వే జానపద కథ



"నేను చాలా అలసిపోయాను. ఈపూట ప్రయాణం చెయ్యటం నావల్ల కాదు," అన్నాడు అన్న.

ఆ రాత్రికి ఆ అన్నదమ్ములు ఆ దీవిలో ఉన్న ఇంట్లోనే గడిపారు. తమ్ముడు తెల్లవారి లేచే సరికి అన్న లేడు. వాళ్ళు వచ్చిన పడవ కూడా లేదు. కాని ఆహార పదార్థాలూ, ఒక తుపాకీ ఇంకా అనేక ఇతర వస్తువులూ ఉండిపోయాయి.

"అన్న సాయంకాలానికి తిరిగి వస్తాడులే," అనుకుని తమ్ముడు వంట చేసుకుని సుఖంగా భోజనం చేశాడు.

రోజులూ, వారాలూ గడిచిపోతున్నాయి గాని అన్న రాలేదు. తన వంతు ఆస్తి కూడా కాజేసే ఉద్దేశంతో తనను అన్న ఈ నిర్జనమైన లంక మీద వదిలి వెళ్ళాడని తమ్ముడు గ్రహించాడు. అన్న అవతలి వొడ్డు చేరుతూ, పడవను బోల్తా కొట్టించి, తన తమ్ముడు సముద్రంలో మునిగిపోయినట్టు ఊళ్ళో అందరికీ చెప్పాడు.

అయితే తమ్ముడు విచారించి, మతి పోగొట్టుకోలేదు. ఒక తెప్ప తయారు చేసుకుని దాని సహాయంతో చేపలు పట్టాడు; తుపాకితో పిట్టలను కొట్టాడు; ఎలాగో తన పొట్ట పోసుకుంటూ ఆ దీవి మీదనే నివసించసాగాడు.

చలికాలం వచ్చింది. అందరూ అనుకునేది నిజమైతే ఆ దీవి మీదికి మరుగుజ్జులు వచ్చేది ఈ రోజులలోనే. "రానీ! కాస్త సందడిగానన్నా ఉంటుంది," అనుకున్నాడు తమ్ముడు.

నడి శీతాకాలంలో ఒకనాడు చీకటి పడినాక సముద్రం మీది నుంచి అతనికి వాద్యసంగీతం వినవచ్చింది. అతను బయటికి వచ్చి చూసేసరికి సముద్రం మీద వెలుగు కనబడింది. ఆ వెలుగు ఒక పడవ నుంచి వస్తున్నది. దాని తెరచాప నలుచదరంగా, పట్టుతో చేసినట్టుగా ఉన్నది. దాని కట్టుతాళ్ళు ఉక్కు తీగలంత సన్నగా ఉన్నాయి. పడవ నిండా మరుగుజ్జులు నీలం రంగు బట్టలు ధరించి

ఉన్నారు. చుక్కాని వద్ద పెళ్ళికూతురి వేషంలో ఒక అమ్మాయి నిలబడి ఉన్నది. ఆమె చూడటానికి ఏ మహారాణో అన్నట్టు న్నది. ఆమె మరుగుజ్జు కాదు, మామూలు మనిషే..

పడవ తానున్న చోటికి వస్తూండటం గమనించి, అతను చప్పున ఇంట్లోకి పరిగెత్తి, గోడన వేళ్లాడుతున్న తుపాకీ తీసుకుని, అటక మీది కెక్కి పడుకున్నాడు.

త్వరలోనే మరుగుజ్జు లందరూ ఇంట్లో ప్రవేశించారు. ఇల్లు వాళ్ళతో కిటకిటలాడి పోయింది. మరుగుజ్జులు ఇంటిని రాజ భవనం లాగా చేశారు. ఎక్కడ చూసినా వెండి, బంగారు పాత్రసామానే.

మరుగుజ్జు లందరూ భోజనాలు చేసి, కోలాహలంగా నృత్యం చెయ్యసాగారు. ఒక్క పెళ్ళికూతురు తప్ప మిగిలిన వాళ్ళందరూ నృత్యం చేస్తున్నారు. మరుగుజ్జు పెళ్ళికొడుకు ఆమెను నృత్యం చెయ్యమని ఆహ్వానించాడు గాని, ఆమె చిరాకుపడి వాణ్ణి ఒక్కతోపు తోసింది.

తమ్ముడు అటక మీది నుంచి గాలి కిటికీ కుండా బయటికి దిగి, మరుగుజ్జుల పడవను బంధించి, ఇంటి ముందు ద్వారానికి వచ్చి, లోపల జరిగేది చూస్తూ నిలబడ్డాడు. కొంచెంసేపు అలా చూసి, ఇక ఈ ఉత్సవాన్ని ముగించాలనుకొని,



తుపాకీ ఎత్తి ఇంటిలోకి పేల్చాడు. తుపాకీ మోత వినగానే మరుగుజ్జు లందరూ పొలోమని బయటికి వచ్చేశారు. వాళ్ళు తమ పడవ దృఢంగా బంధించి ఉండటం చూసి కొండలలోకి పారిపోయారు.

ఇంట్లో పెళ్ళికూతురూ, తమ్ముడూ, మరుగుజ్జుల వెండి, బంగారు పాత్ర సామగ్రీ మిగిలాయి. పెళ్ళికూతురు అతనికి తన కథ అంతా చెప్పింది. ఆమె చిన్న పిల్ల అయి ఉండగా మరుగుజ్జులు ఆమెను ఎత్తుకుపోయి సాకారు. ఆమెకు జీవితం సుఖంగానే గడిచింది గాని, మరుగుజ్జు లామెకు నచ్చలేదు. ఒక మరుగుజ్జు వాడు తనని పెళ్ళాడమని ఆమెను తెగ

పీడించసాగాడు. అప్పటి నుంచీ ఆమెకు వాళ్ళమీద మరీ అసహ్యం పుట్టింది.

పెళ్ళికూతురి ఊరి పేరూ, తల్లి పేరూ వినగానే వాళ్ళు తనకు దూరపు బంధువులని తమ్ముడికి తెలిసిపోయింది. "నేను నిజంగా సుడిగలవాణ్ణే. సందేహంలేదు," అనుకున్నాడతను. తరవాత వాళ్ళిద్దరూ మరుగుజ్జుల పడవలోనే సముద్రం దాటి తమ పట్టణం చేరి, అక్కడ పెళ్ళి చేసుకుని, కాపరం ప్రారంభించారు.

ఇప్పుడుతనతమ్ముడుతనకన్నధనికుడు కావటం చేత అన్న అతని సంపద మరుగుజ్జుల నుంచే వచ్చిందని ఊహించాడు.

మరుసటి ఏడు శీతాకాలం, అన్న దీవి మీదికి వెళ్ళాడు. అతను దీవిని సమీపిస్తూండగా అతనికి సముద్రం మీద కాంతులూ, భయంకరమైన కేకలూ వినిపించాయి. అతను భయపడి తమ ఇంటిలోకి పరిగెత్తాడు.

ఈసారి సముద్రం మీద వచ్చిన వాళ్ళు మరొక జాతి మరుగుజ్జులు. వాళ్ళు లావుగా ఉండి, పైనుంచి కిందికి తోళ్ళు ధరించి ఉన్నారు. వాళ్ళు పడవలో రాలేదు, సముద్రాన్ని ఈది వచ్చారు. వాళ్ళు తమ ఇంట్లోకి రాబోతున్నారని గ్రహించి అన్న తాను కూడా అటక మీదికి ఎక్కాడు.

ఒక మరుగుజ్జు పొయిలోకి తుమ్మేసరికి నిప్పు రాజుకున్నది. ఆ నిప్పులో మరుగుజ్జులు సముద్రపు పాచీ, తడి చెక్కలూ వేసి ఇల్లంతా ఊదర పెట్టారు. అన్న కూడా గాలికిటికీలో నుంచి బయటికి పోవ యత్నించాడు గాని, కాస్త స్థూల శరీరం కావటం చేత మధ్యలో ఇరుక్కుపోయి, భయంతో కేకలు పెట్టాడు. మరుగుజ్జులు అంతకన్న గట్టిగా కేకలు పెడుతూండటం చేత అన్న కేకలు ఎవరికీ వినిపించలేదు.

తొలికోడి కూసే వేళకు మరుగుజ్జులు వెళ్ళిపోయారు. అన్న కూడా గాలికిటికీ నుంచి ఇవతల పడగలిగాడు. అతను ఎలాగో ఇంటికి చేరాడు. కాని, త్వరలోనే ఉన్మాది అయిపోయాడు.






రాముడు శంబూకుణ్ణి చంపి, అయోధ్యకు తిరిగి వస్తూనే, ద్వారపాలకుడితో భరత లక్ష్మణులను తన వద్దకు పంపమని చెప్పాడు. వారు త్వరలోనే రాముడి వద్దకు వచ్చారు. వాళ్ళను కూర్చోబెట్టి రాముడు, "తమ్ములూ, అన్ని పాపాలనూ పోగొట్టే రాజసూయం చేద్దామనుకుంటున్నాను. పూర్వం మిత్రుడూ, చంద్రుడూ రాజసూయం చేసే శాశ్వతమైన కీర్తి గడించారు. అందుకు మీ సలహా ఏమిటి?" అని అడిగాడు.

దానికి భరతుడు, "అన్నా, నీ ధర్మానికీ, కీర్తికీ లోటేమున్నది. రాజసూయం చేశావంటే అనేక రాజవంశాలు నాశనమవుతాయి, రక్తపాతం జరుగుతుంది. పౌరుషంకొద్దీ రాజులు నశిస్తారు. అందుచేత రాజసూయం చేసి, భూమికి సంక్షోభం కలిగించవద్దు," అన్నాడు.

భరతుడన్న మాట రాముడికి నచ్చింది. మంచి సలహా ఇచ్చినందుకతను భరతుణ్ణి మెచ్చుకున్నాడు.

అప్పుడు లక్ష్మణు డిలా అన్నాడు: "అన్నా, సమస్త పాపాలనూ పోగొట్టే మహాయజ్ఞం అశ్వమేధం. పూర్వం ఒకప్పుడు ఇంద్రుడు తనకు మహాపాతకం చుట్టుకోగా, బృహస్పతి సహాయంతో, అశ్వమేధం ద్వారా ఆ పాపాన్ని పోగొట్టుకున్నాడు."

లక్ష్మణుడా వృత్తాంతాన్ని ఈ విధంగా చెప్పాడు:

12. అశ్వమేధయాగం



పూర్వం వృత్రుడనే గొప్ప రాక్షసు డుండేవాడు. అతను మహాధర్మపరుడు, గొప్ప జ్ఞాని; మూడు లోకాలనూ ఎంతో ప్రేమగా చూసుకుంటూ, చీమకు సైతం హాని కలిగించకుండా, ధర్మం తప్పకుండా పాలించాడు. అతని పాలనలో సకాలంలో వర్షాలు కురిసేవి. భూమి అన్ని కోరిక లనూ తీర్చేది, దున్నకుండానే పండేది, పూలూ, పళ్ళూ, కాయలూ రసవంతంగా ఉండేవి.

ఇలా ఉండగా వృత్రుడికి తపస్సు చేయాలని సంకల్పం కలిగింది. అతను తన పెద్దకొడుక్కు రాజ్యం అప్పగించి ఉగ్రమైన తపస్సు ప్రారంభించాడు. ఆ తపస్సు చూసి దేవేంద్రుడు బెదిరి పోయాడు. అతను విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి, "వృత్రుడు అదివరకే మూడు లోకాలనూ జయించాడు. ఇప్పుడు తపస్సు కూడా ప్రారంభించాడు. ఈ తపస్సు పూర్తి అయిందంటే లోకా లుండేటంత కాలమూ అతన్ని నేను జయించలేను. అందుచేత నువు ఆ వృత్రుణ్ణి కడతేర్చితే గాని నాకూ, దేవతలకూ దిక్కు లేదు," అన్నాడు.

దేవతల పక్షాన ఇంద్రు డిలా మొర పెట్టుకోగా, విష్ణుమూర్తి, 'మహాత్ముడైన వృత్రుడు నాకు స్నేహితుడు. అందుచేత నేనతన్ని చంపను. అయితే నీ కోరిక కూడా తీసివెయ్యటానికి లేదు. అందు కని వృత్రుడు చచ్చే ఉపాయం ఒకటి చేస్తాను. నా శక్తిని మూడు భాగాలు చేసి, ఒక భాగం నీ లోనూ, ఒకటి వజ్రా యుధం లోనూ, మూడవదాన్ని భూమి లోనూ, ప్రవేశపెడతాను. అప్పుడు నువు వృత్రుణ్ణి సులభంగా చంపగలుగుతావు." అన్నాడు.

ఈ మాటలు విని ఇంద్రుడూ, దేవతలూ సంతోషించి, వృత్రుడు తపస్సు చేసుకునే వనానికి వెళ్ళారు. తపశ్శక్తి చేత మూడు లోకాలనూ దహించేటట్టుగా వెలిగిపోతూ వృత్రుడు వారికి కనిపించాడు. అతన్ని

చూస్తేనే దేవతలకు ఎక్కడలేని దడ పుట్టింది. ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని రెండు చేతులా పట్టి వృత్రుడి తలను తెగ వేశాడు.

వెంటనే బ్రహ్మహత్య ఇంద్రుడి శరీరాన్ని చుట్టుకున్నది. అతనికి తీరని దుఃఖం పుట్టుకొచ్చింది. అప్పుడు దేవతలు విష్ణువుతో, "దేవా, నువ్వేమో వృత్రుణ్ణి చంపావు; బ్రహ్మహత్య ఇంద్రుణ్ణి చుట్టుకున్నది. అది వదిలే ఉపాయం చెప్పు," అని మొర పెట్టుకున్నారు.

"ఇంద్రుడు అశ్వమేధం చేసినట్టయితే బ్రహ్మహత్య తొలగిపోయి అతడు ఎప్పటి దేవేంద్రుడవుతాడు," అని విష్ణుమూర్తి దేవతలకు చెప్పాడు.

ఈ సలహా విని దేవతలు బృహస్పతి మొదలైన మునులను వెంటబెట్టుకుని ఇంద్రుడున్న చోటికి వెళ్ళారు. ఇంద్రుడు తెలివి పూర్తిగా పోయి, భయభ్రాంతుడై ఒకచోట పడి ఉన్నాడు. ఆ ఇంద్రుణ్ణి వెంట ఉంచుకుని బృహస్పతి సహాయంతో దేవతలు శ్రద్ధగా అశ్వమేధయాగం చేసిన మీదట, అతన్ని బ్రహ్మహత్య వదలి పావం పోయింది.

లక్ష్మణుడు ఈ కథ చెప్పిన మీదట రాముడు అశ్వమేధం యొక్క మహిమను తెలిపే మరొక కథ చెప్పాడు:



పూర్వం కర్దమప్రజాపతి కొడుకు ఇలుడు బాహ్లికదేశాన్ని పరిపాలించేవాడు. అతనంటే దేవతలకూ, రాక్షసులకూ, నాగులకూ, యక్షులకూ, గంధర్వులకూ ఎంతో గౌరవం వుండేది.

ఒక చైత్ర మాసంలో ఇలమహారాజు తన పరివారాన్ని వెంటబెట్టుకుని అడవికి వేటకు వెళ్ళాడు. ఎన్ని వేల మృగాలను చంపినా అతనికి వేట తమకం ఏమాత్రం తీరలేదు. అందుచేత అతను వేటాడుతూ పోయి పోయి, కుమారస్వామి పుట్టిన చోటికి వెళ్ళాడు. అక్కడ పార్వతీ పరమేశ్వరులూ, వాళ్ళ అనుచరులూ ఉన్నారు.



ఆ పర్వత ప్రదేశంలో గల విశేష మేమిటంటే, అక్కడ చెట్లూ, పక్షులూ, జంతువులూ కూడా ఆడవే.

అక్కడికి చేరుతూనే, ఇలుడూ, అతని భృత్యులూ కూడా స్త్రీలుగా మారిపోయారు. తనలో కలిగిన మార్పు చూసి ఇలుడికి బాధా, భయమూ పుట్టాయి. అతను శివుడి దగ్గిరకు వెళ్ళి స్తోత్రం చేసి, కాళ్ళ పైన పడి రక్షించమన్నాడు.

"నీ ఆడతనం పోగొట్టటం తప్ప ఇంకేమైనా కోరుకో," అన్నాడు శివుడు.

ఇలుడు శివుణ్ణి మరొక వర మేదీ కోరక, పార్వతిని రక్షించుమని దీనాతి దీనంగా ప్రార్థించాడు. పార్వతి అతనిపై జాలిపడి, అతను ఒక నెల స్త్రీగానూ, మరొక నెల పురుషుడుగానూ ఉండేటట్టూ, స్త్రీగా ఉండేటప్పుడు జరిగేది పురుషుడుగా ఉండేటప్పుడు జ్ఞాపకం లేకుండానూ వర మిచ్చింది.

ఇలుడు కాస్తా ఇలగా మారింది. అతని సైనికు లందరూ స్త్రీలే అయారు. వారందరూ, యథేచ్ఛగా ఆ అడవిలో తిరగసాగారు.

వాళ్ళు స్త్రీలుగా మారిన కొండకు సమీపంలోనే ఒక అందమైనసరస్సున్నది. అక్కడనే చంద్రుడి కొడుకైన బుధుడు ఆశ్రమం కల్పించుకుని, తపస్సు చేసుకుంటున్నాడు. అతను మంచి యౌవనంలో ఉండి, ఆకర్షణీయంగా ఉన్నాడు.

ఇలా, ఆమె వెంట ఉన్న స్త్రీలూ సరస్సులో దిగి, దాన్ని కల్లోలం చెయ్యసాగారు. బుధుడు వారిని చూసి, ఇల సౌందర్యం చేత ఆకర్షితుడయాడు. అంత అందమైన స్త్రీ మూడు లోకాలలోనూ మరొకతె ఉండదని అతనికి తోచింది. ఇల వెంట ఉన్న స్త్రీలను కొందరిని అతను ఆశ్రమంలోకి పిలిచి, "ఆమె ఎవరు? ఈ ప్రాంతానికి ఏం పని మీద వచ్చింది? నిజం చెప్పండి," అన్నాడు.

"అయ్యా, ఆమె మాకు నాయకురాలు. ఆమెకు భర్త లేడు. మమ్మల్ని వెంట



పెట్టుకుని ఇలా అరణ్యమంతా తిరుగుతున్నది,'' అన్నా రా స్త్రీలు.

''మీ రంతా ఈ ఆశ్రమంలోనే కంద మూలాలు తింటూ హాయిగా ఉండిపొండి. ఇక్కడ ఉండే కింపురుషులు మీకు భర్తలౌతారు,'' అని బుధుడు వారితో అన్నాడు. వాళ్ళందరూ అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

తరవాత బుధుడు ఇలతో, ''నేను చంద్రుడి కొడుకును. నా పేరు బుధుడు. నన్ను భక్తి స్నేహాలతో చూసుకుంటూ ఇక్కడే సుఖంగా ఉండిపో,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

''నీ యిష్టం,'' అన్నది ఇల.

ఇద్దరూ మహాసంతోషంగా ఆ నెల గడిపారు. ఒకనాడు ఉదయం ఇల కాస్తా ఇలమహారాజై పక్క మీది నుంచి లేచాడు. అతనికి జరిగినదేదీ జ్ఞాపకం లేదు. సరస్సులో బుధుడు చేతులు పైకెత్తి తపస్సు చేసుకుంటున్నాడు. ఇలుడతన్ని చూసి. ''అయ్యా. నేను నా సైనికులతో ఈ పర్వత ప్రాంతానికి వేటకై వచ్చాను. వారంతా ఎటు పోయారో తెలియకుండా ఉన్నది,'' అన్నాడు.

''రాజా, రాళ్లవాన కురిసి, నీ పరివారమంతా నశించింది. నువు మాత్రం ఈ ఆశ్రమంలో తల దాచుకున్నావు. విచారించకు, ఇక్కడ నువు సుఖంగా ఉండవచ్చు,'' అన్నాడు బుధుడు.

ఇలుడు తన అనుచరులు పోయినందుకు ఎంతగానో దిగులుపడుతూ, ''నా కింక రాజ్యం ఏలాలని లేదు. మీరు అనుమతిస్తే నేను నా పెద్దకొడుకైన శశిబిందుడికి పట్టం కట్టి, వెంటనే తిరిగి వస్తాను,'' అన్నాడు.

''ఇలమహారాజా, ఎందుకలా కలవరపడతావు? ఒక సంవత్సరం ఇక్కడ ఉండు. నీకు మేలు కలిగేటట్టు చేస్తాను,'' అన్నాడు బుధుడు. ఇలుడు సరేనన్నాడు.

ఒక నెలపాటు స్త్రీగా ఉండి మరొక నెలపాటు పురుషుడుగా ఉంటూ ఇలుడు



తాను స్త్రీగా ఉన్న సమయంలో బుధుడికి ఒక కొడుకును కన్నాడు.

అటుతరవాత బుధుడు సంవర్తుణ్ణీ, చ్యవనుణ్ణీ, ప్రమోదనుణ్ణీ, దుర్వాసుడు మొదలుగా గల ఇతర ఋషులనూ పిలిపించి, వారికి ఇలుణ్ణి పరిచయం చేసి, అతని పరిస్థితి యథాప్రకారం అయేటందు కేమైనా దారి చెప్పమన్నాడు. ఈ సమయంలోనే ఇలుడి తండ్రి అయిన కర్దముడూ, మరికొందరు ఋషులు కూడా అక్కడికి వచ్చారు. అందరూ ఇలుడికి తలా ఒక సలహా ఇచ్చారు. కాని కర్దముడు, తన కొడుక్కు మేలు కలగాలంటే, అశ్వమేధయాగం చెయ్యటమే మార్గమన్నాడు. ఆయన సలహా ప్రకారం అందరూ చేరి అశ్వమేధయాగం చేసి, ఇలమహారాజుకు స్త్రీత్వం లేకుండా చేశారు. యజ్ఞం పూర్తి అయే సమయానికి సాక్షాత్తు శివుడే ప్రత్యక్షమై ఇలమహారాజును అనుగ్రహించాడు.

తరవాత ఇలుడు బాహ్లికదేశానికి తిరిగి వెళ్ళక, మధ్యదేశంలోని ప్రతిష్ఠానపురాన్ని ఏలుతూ, అక్కడే ఉండిపోయాడు. అతని కొడుకు శశిబిందుడు బాహ్లికదేశాన్ని పాలించాడు. ఇలకూ బుధుడికీ పుట్టిన పురూరవసుడు ఇలమహారాజు అనంతరం ప్రతిష్ఠానపురానికి రాజయాడు.

రాము డీ కథ తన తమ్ములకు చెప్పి, లక్ష్మణుణ్ణి పంపి, తన పురోహితులైన వసిష్ఠ, వామదేవ, జాబాలి మొదలైన వారిని రప్పించి, తాను అశ్వమేధం తలపెట్టిన సంగతి వారికి తెలియజేశాడు. ఆ మాట విని వారు సంతోషించారు.

అశ్వమేధానికి అవసరమైన ప్రయత్నాలు వెంటనే ప్రారంభమై చాలా చురుకుగా సాగాయి.

సపరివారంగా బయలుదేరి రావలిసిందనీ, యజ్ఞోత్సవంలో పాల్గొనవలిసిందనీ, లక్ష్మణుడు కిష్కింధలో సుగ్రీవుడికీ, లంకలో విభీషణుడికీ ఆహ్వానాలు

పంపాడు. రాముడి మంచి కోరే రాజులందరికీ ఆహ్వానాలు వెళ్లాయి. నానాదేశాల బ్రాహ్మణులూ, ఋషులూ, సకుటుంబంగాగృహస్థులూ, గాయకులూ, నటులూ, నర్తకులూ ఆహ్వానించబడ్డారు.

నైమిశ వనంలో గోమతీ నదీతీరాన యజ్ఞశాల నిర్మించబడింది. వేలకొద్దీ బళ్ళతో ధాన్యమూ, అపరధాన్యాలూ, ఉప్పూ, గంధమూ చేరాయి. కోట్లకొద్దీ బంగారం వచ్చింది. వంటవాళ్ళూ, శిల్పులూ వచ్చారు. రాముడి అంతఃపురం నుంచి అతని తల్లులూ, బంగారు సీతా భరతుడి వెంట వచ్చి యజ్ఞం జరిగే చోటికి చేరారు. ఆహ్వానితులకు సకల సదుపాయాలతో విడుదులు వేరువేరుగా ఏర్పాటు చేయబడ్డాయి.

ఈ ఏర్పాట్లన్నీ అయే లోపల రాముడు ఒక నల్లని గుర్రాన్ని విడిచి, దాని వెంట ఋత్విజులనూ, లక్ష్మణుణ్ణీ పంపాడు.

యజ్ఞం చూడవచ్చిన రాజులు రాముడికి విలువైన కానుకలు తెచ్చారు, వారి సౌకర్యాలను భరత శత్రుఘ్నులు చూశారు.

బ్రాహ్మణుల సౌకర్యాలను సుగ్రీవుడి వానరులూ, ఋషుల సౌకర్యాలను విభీషణుడి రాక్షసులూ చూశారు.

యజ్ఞం చాలా జయప్రదంగా జరిగింది. ఎక్కడా, ఎవరికీ, ఏ లోటూ కలిగిందన్న మాట పుట్టలేదు. భోజనాల దగ్గిర ఎవరూ నోరు తెరిచి అడగకుండానే కావలిసిన పదార్థాలు వడ్డన అయాయి. బంగారమేమిటి, ధనమేమిటి, రత్నాలేమిటి, బట్టలేమిటి, ఎవరేమి కోరినా ఇచ్చారు. ఈ వస్తువులన్నీ పెద్ద పెద్ద కుప్పలుపోసి, రాత్రీ, పగలూ కూడా అడిగినవారికి ఇస్తూనే వచ్చారు. అలాటి యజ్ఞాన్ని ఇంద్రుడూ, కుబేరుడూ, యముడూ కూడా చేసి ఉండలేదని చెప్పుకున్నారు. వానరులకూ, రాక్షసులకూ చేతినిండా పని పడింది. యాచకులు కోరినదల్లా వారే ఇస్తూవచ్చారు. ఇదేవిధంగా ఏడాది గడిచి యజ్ఞం పూర్తి అయింది.



# వైద్యులు భయపడవలసిన వాళ్ళు

ఘనవైద్యుడుగా పేరుమోసిన వీరాచారి దగ్గిర, శరభాచారి అనే యువకుడు వైద్యం నేర్చుకుంటున్నాడు. ఒకనాడు అతను, వీరాచారిని, "గురుదేవా, మనవద్దకు వచ్చే రోగుల్లో, ఎలాంటి వాళ్ళకు వైద్యం చేయడం కష్టం?" అని అడిగాడు.

"మూర్ఖుడికి, అమాయకుడికి వైద్యం చేయడం, కష్టం. అనుభవంతో అలాంటివాళ్ళను కనిపెట్టి, జాగ్రత్తపడాలి. మనం చెప్పింది ఒకటైతే, వాళ్ళు అర్థం చేసుకున్నది మరొకటయినప్పుడు, ప్రమాదం!" అన్నాడు వీరాచారి.

అంతలో అక్కడికి, ఒళ్ళంతా కురుపులతో గోక్కుంటూ, పానకాలనే వ్యక్తి వచ్చి, "ఆచారిగారూ, పోయిన సంవత్సరం, నాకు జలుబుకు మందిస్తూ, స్నానం చేయవద్దన్నారు. అప్పటి నుంచీ స్నానం చేస్తే జలుబు వస్తుందేమోనని, స్నానం మానాను; జలుబు తగ్గింది. ఈసారి, యీ చీడకురుపులు నయమయే మందిచ్చి, పుణ్యం కట్టుకోండి," అన్నాడు.

వీరాచారి, అతడికి మందిచ్చి పంపి, శరభాచారితో, "మూర్ఖుడుగా, అమాయకుడుగా, మంచి ఉదాహరణ, యీ పానకాలే! నేనతణ్ణి స్నానం చేయవద్దన్నది, జలుబు తగ్గేవరకు మాత్రమే. అతడర్థం చేసుకున్నది, ఇక ఏనాడూ స్నానం వద్దన్నానని. అందుకే, యిలాంటి వాళ్ళ విషయంలో, జాగ్రత్తపడాలన్నాను," అని చెప్పాడు. —ఎం. డి. సౌజన్య





# వ్యాపారస్థుడి స్నేహం

గోపవరం గ్రామంలో భూషయ్య అనే అతను, బియ్యం వ్యాపారం చేస్తూ మంచి పేరూ, ఎంతో డబ్బూ సంపాయించాడు. అదే గ్రామంలో, తనకున్న కొద్దిపాటి భూమిని కష్టపడి సాగుచేసుకుంటూ జీవిస్తున్న చంద్రయ్య, భూషయ్యకు మంచి స్నేహితుడు.

చంద్రయ్యకు జీవితం రోజు, రోజుకూ దుర్భరం కాసాగింది. కారణం, అతడి వ్యవసాయం కేవలం వర్షాధారం. వరుసగా కొన్ని సంవత్సరాలు వర్షాలు సకాలంలో కురవకపోవడంవల్ల, ప్రతి ఏడూ పంట సరిగ్గా పండక, చంద్రయ్య ఆర్థిక పరిస్థితి బాగా దెబ్బతిన్నది.

ఇలా రోజులు గడుస్తూండగా, ఒకనాడు చంద్రయ్య, భూషయ్యను చూడబోయాడు. కుశల ప్రశ్నల తర్వాత, చంద్రయ్య తను వచ్చిన పని మెల్లగా బయటపెడుతూ, "చూడు, భూషయ్యా! నేను ఎంతో కష్టపడినప్పటికీ వ్యవసాయం, నాకు ఏమాత్రం కలిసిరావడం లేదు. నువ్వు, డబ్బు సాయం చేస్తే, ఏదైనా వ్యాపారం ప్రారంభించాలనుకుంటున్నాను," అన్నాడు.

"ఏం వ్యాపారం?" అని ప్రశ్నించాడు భూషయ్య.

"బియ్యంవ్యాపారం," అన్నాడు చంద్రయ్య.

"అలాగా! ఏ ఊళ్లో ప్రారంభించాలనుకుంటున్నావు?" అని అడిగాడు భూషయ్య.

"మరెక్కడో ఎందుకు! మన గ్రామంలోనే," అని సమాధానం యిచ్చాడు చంద్రయ్య.

భూషయ్య ఒకక్షణం ఏదో ఆలోచిస్తున్నవాడిలా వూరుకుని, ఆ తరవాత తల

పెంటకోట సోమినాయుడు

పంకిస్తూ "చంద్రయ్యా, కొందరను కుంటున్నట్టుగా, నా దగ్గిర డబ్బేమీ మూలగడం లేదు. ఈ మధ్య, వ్యాపారంలో లాభాలు బాగా తగ్గిపోయినై. అందువల్ల, ఏమీ అనుకోకు. ప్రస్తుత పరిస్థితుల్లో, నీకేమీ సాయం చేయలేను," అన్నాడు.

ఆ జవాబుకు చంద్రయ్య దిగాలు పడిపోయి, మౌనంగా కొంచెంసేపు కూర్చుని, "సరే, వెళ్ళొస్తా!" అని భూషయ్యకు చెప్పి, ఇంటికి తిరిగి పోయాడు.

కొద్ది కాలం గడిచాక చంద్రయ్యకు, మరొక జటిల సమస్య ఎదురయింది. అతడికి పెళ్ళీడుకెదిగిన కూతురున్నది. ఆమెకు పెళ్ళి చెయ్యాలని సంబంధాల కోసం వెతుకుతూంటే, ఒక మంచి సంబంధం వచ్చింది. కాని, వాళ్ళు కట్నంగా పదివేల రూపాయలు కావాలన్నారు. ఎవరినైనా అప్పు అడుగుదామంటే, చంద్రయ్యకు గ్రామంలో చెప్పుకోదగిన పరపతిలేదు.

ఆ పరిస్థితుల్లో చంద్రయ్య భార్య, అతడికి భూషయ్యను డబ్బడగమని సలహా యిచ్చింది. అయితే, చంద్రయ్యకు, అది ఏమాత్రం యిష్టం లేదు. అతడికి తన పూర్వానుభవం గుర్తుకు వచ్చింది. అయినా గత్యంతరం లేక, భూషయ్యను చూడబోయాడు.

చంద్రయ్య, తనకొచ్చిన చిక్కు గురించి చెప్పగానే, భూషయ్య, "భలే



వాడివే, చంద్రయ్యా! నీ కూతురు పెళ్ళి ఒకటీ, నా కూతురు పెళ్ళి ఒకటీనా?'' అంటూ గబగబా లోపలి గదిలోకి పోయి డబ్బు తెచ్చి, ''ఇదిగో, పదిహేనువేలు తీసుకో,'' అని చంద్రయ్య కిచ్చాడు ఎంతో సంతోషంగా.

''నాకా్కవలసింది, పదివేలే గదా!'' అన్నాడు చంద్రయ్య.

''అవుననుకో. కాని, కట్నం పదివేలు పోగా, యింకా పెళ్ళి ఖర్చులకు డబ్బు అవసరం అవుతుందిగదా. మరొక సంగతి; ఆ ఐదువేలూ నువ్వు, నాకు తిరిగి యివ్వ నవసరంలేదు. ఆ మొత్తం, నీ కూతురుకు, నా పెళ్ళికానుక,'' అన్నాడు భూషయ్య తృప్తిగా నవ్వుతూ.

చంద్రయ్య, తన స్నేహితుడి సహాయానికి ఎంతగానో సంతోషిస్తూ, ఇంటికి వెళ్ళిపోయాడు.

ఇదంతా గమనించిన భూషయ్య భార్య, భర్తతో, ''లోగడ మీ స్నేహితుడు డబ్బు కోసం వచ్చినప్పుడు లేదన్నారు. ఇప్పుడు యింతగా సాయంచేశారు. కారణం ఏమిటో, నాకర్థం కావడంలేదు,'' అన్నది ఆశ్చర్యంగా.

అందుకు భూషయ్య, ''చంద్రయ్య లోగడ వచ్చినప్పుడు, వ్యాపారం ప్రారంభించేందుకు డబ్బు సాయం అడిగాడు. ఆ వ్యాపారం ఏమిటో తెలుసుగదా— బియ్యం వ్యాపారం. అదీ, ఈ గ్రామంలోనే! అంటే, నా డబ్బు సాయంతో చంద్రయ్య, నాకు పోటీదారు కాబోతున్నాడన్నమాట. అందువల్లనే, నాలోని వ్యాపారి, అతడికి సాయం చేయవద్దన్నాడు,'' అని చెప్పాడు మందహాసం చేస్తూ.

''మరి, ఇప్పటి సంగతేమిటి?'' అని అడిగింది భూషయ్య భార్య మరింత ఆశ్చర్యంతో.

''ఇప్పుడు, నాలోని నిజమైన స్నేహితుడు, చంద్రయ్య కూతురు పెళ్ళికి సాయపడమన్నాడు. అసలు విషయం ఇప్పుడర్థమైందా?'' అంటూ తృప్తిగా నవ్వాడు భూషయ్య.





# అపకారికి ఉపకారం

## 7

పరదేశిని ఓడించిన వాళ్ళనే పెళ్ళాడతానని ప్రియంవద చెప్పిన మరసటి రోజున, జయవిజయు లిద్దరూ, పరదేశిని కుస్తీపోటీకి సవాలు చేశారు. పరదేశి, వాళ్ళతో, ''ఒకరి తర్వాత, ఒకరెందుకు? మీ యిద్దరితో ఒకేసారి కుస్తీపట్టి ఓడిస్తాను,'' అన్నాడు.

ఆ వెంటనే జయవిజయులకూ, పరదేశికీ మల్లయుద్ధం జరిగింది. పరదేశి మధ్యన నిలబడితే, జయవిజయులు, అమితోత్సాహంతో అతడికి చెరొకపక్కా నిలబడ్డారు. పరదేశి వాళ్ళ చేతుల్లో చిత్తుగా ఓడిపోయాడు!

ఇది చూసి ప్రియంవద తెల్లబోయింది. పరదేశి, జయవిజయు లిద్దర్నీ తేలికగా ఓడించగలడని, ఆమె అనుకున్నది.

''మేం ఇద్దరం, పరదేశిని చిత్తుచేశాం. మాలో ఎవర్ని పెళ్ళి చేసుకుంటావో చెప్పు!'' అన్నాడు జయుడు.

''మీ యిద్దరిలో, ఎవరు బలవంతులో తేల్చుకోండి. కావాలంటే యిందుకు, మీ పెద్దలను సంప్రతించండి,'' అన్నది ప్రియంవద.

జయవిజయులు, తమ తల్లిదండ్రుల వద్దకు వెళ్ళి, ప్రియంవదను పెళ్ళాడా లన్న తమ కోర్కెను తెలియబరిచారు.

అప్పుడు పెద్దపెద్ద, చిన్నపెద్ద సమావేశమై, యీ విషయం గురించి చాలా సేపు మాట్లాడుకున్నారు. వాళ్ళకు తెగని సమస్య ఏమంటే—ఎంత నచ్చచెప్పినా, ప్రియంవద విషయంలో, జయవిజయులు ఒక అంగీకారానికి రావడం లేదు. ఇద్దరూ

"వసుంధర"



వుంటున్నారు. ఇప్పుడు ప్రియంవద గురించి, తమ కుటుంబాల మధ్య కలత వచ్చేలా వున్నది. ఇందువల్ల నష్టపోయే దెవరు ?

ఇదంతా, తమ యిద్దరి మధ్యా కలతలు తేవడానికి, పరదేశి పన్నుతున్న పన్నాగం కాదుగదా—అని వాళ్ళకు అనుమానం వచ్చింది.

ఆ వెంటనే పెద్ద లిద్దరూ, పరదేశి దగ్గిరకు వెళ్ళారు. పరదేశి, వాళ్ళు చెప్పింది విని, "ఈ గొడవంతా, ఆ ప్రియంవద మూలంగా వచ్చింది. ఆమె, జయవిజయులకు పోటీ పెట్టింది. అందు వల్లనే, మీ మధ్య కలతలు ప్రారంభ మయాయి. ఇందులో, నా ప్రమేయం ఏమీ లేదు," అన్నాడు.

ఈ జవాబు విని, పెద్దపెద్ద కోపంగా, "ఈ జరిగినదానిలో ప్రియంవద తప్పేమీ లేదు. నువ్వు, జయవిజయు లిద్దర్నీ ఓడించగలవు. అయినా, కావాలని ఓడి పోయావు. ఆ విధంగా, వాళ్ళిద్దరూ కలహించుకోవాలని పథకం వేశావు," అన్నాడు.

పరదేశి చెవులు మూసుకుని, "వాళ్ళిద్దరి సఖ్యతకోసం ప్రాణాలైనా యివ్వగల నేను, వాళ్ళ మధ్య కలతలు సృష్టించడమా ?" అన్నాడు.

ప్రియంవదను పెళ్ళాడాలని తహతహ లాడుతున్నారు.

"నేను పెద్దవాణ్ణి. అందువల్ల, నా కొడుకు జయుడు, ప్రియంవదను పెళ్ళి చేసుకుంటాడు," అన్నాడు పెద్దపెద్ద.

"ఇంతకాలం, మనిద్దరిలో ఎవరు గొప్ప అన్న సమస్య తల ఎత్తలేదు. ఈ పెళ్ళి జరిగితే, నువ్వూ, నీ కొడుకూ, మా కుటుంబంకంటే గొప్పవాళ్ళ యి పోతారు. అది నేను సహించలేను," అన్నాడు చిన్నపెద్ద.

అప్పుడు పెద్ద లిద్దరి మనసుల్లోనూ, ఒక విషయం తళుక్కుమన్నది. ఇంత కాలంగా తామిద్దరూ ఎంతో సఖ్యంగా

"అయితే, మాపిల్లలచేతుల్లో నువ్వెందు కోడినట్టు ?" అని అడిగాడు చిన్నపెద్ద.

"నేను కావాలని ఓడిపోలేదు. వాళ్ళే ఓడించారు," అన్నాడు పరదేశి.

"అదెలా సాధ్యం! నీ శక్తులన్నీ ఏమయ్యాయి ?" అని అడిగాడు పెద్దపెద్ద.

"ఇప్పుడు నాలో ఏ శక్తులూ లేవు; అన్నీ పోయాయి. ఇందుకూ ప్రియంవదే కారణం. ఆమె గ్రామంలో అడుగు పెడుతూనే, నన్ను ప్రేమిస్తున్నానన్నది. ఆ క్షణంనుంచీ, నాకామెను పెళ్ళాడాలనిపించింది. ఆ స్వార్థచింతనవల్ల, నా శక్తులన్నీ పోయాయి. అపకారికి కూడా ఉపకారం చేయాలన్న మంచి బుద్ధి వుండడంవల్ల, భగవంతుడు సదా నన్ను కాపాడుతూవచ్చాడు. కాని, ఇప్పుడు నాలో స్వార్థం తలఎత్తింది. త్యాగబుద్ధి నశించింది. మీరు అనుమతిస్తే, నేనూ, ప్రియంవదా యీ గ్రామం వదిలి వెళ్ళిపోతాం," అన్నాడు పరదేశి.

ఈ జవాబుకు పెద్దలిద్దరూ తెల్లబోయారు.

"నువు చెబుతున్నది నిజమేనా? అపకారికూ్కడా ఉపకారం చేయాలన్న మంచిబుద్ధి వుంటే, మాకూ యిలాంటి అద్భుత శక్తులు వస్తాయా ?" అన్నాడు చిన్నపెద్ద.



"మనస్ఫూర్తిగా అపకారికి ఉపకారం చేస్తే, అద్భుతశక్తులు, ఆ మనిషిని కాపాడుతూ వుంటాయి. శక్తులు స్వప్రయోజనానికి ఉపయోగపడవు. నాకిప్పుడు నశించినట్టే, ఆ శక్తులు నశించిపోతాయి," అని చెప్పాడు పరదేశి.

అప్పుడు పెద్దలిద్దరూ, పరదేశికినమస్కరించి, "అయ్యా, వయసులో చిన్నవాడివైనా, బుద్ధిలో మాకంటేగొప్పవాడివి. ఇంత కాలం మేము అజ్ఞానంవల్ల ఎన్నో దుర్మార్గాలు చేశాము. ఇకనుంచి గ్రామస్థుల బాగుకోసం పాటుబడతాం," అన్నారు.

"మీలో మంచి మార్పు రావడంకన్న, కావలసిందేముంది! నేనిక్కడికి వచ్చిన



"అదెలా సాధ్యం! మీరు ఇద్దరూ ఆమె కోసం గొడవపడుతున్నారుగదా," అన్నాడు పెద్దపెద్ద.

"ఇప్పుడా గొడవేంలేదు. పూర్వ కాలంలో, ఒకే స్త్రీని నలుగురైదుగురు వివాహమాడినట్టు కథలున్నవి. అదే విధంగా, నేనూ జయుడూ ప్రియంవదను వివాహం ఆడతాం," అన్నాడు విజయుడు.

ఇది విని పెద్దలిద్దరూ ఆశ్చర్యపోయారు. తర్వాత వాళ్ళు, జయవిజయులతో, "మీరు మరీ మొండికెత్తుతున్నారు. ఇక మిమ్మల్ని సహించం. ప్రియంవదకూ, పరదేశికీ వివాహం జరిపించి, ఈ గ్రామాన్నుంచి పంపేస్తాం," అన్నారు.

అందుకు జయుడు "మీరలా చేస్తూంటే, చూస్తూ పూరుకునేందుకు మేమేం చవటలం కాదు. మీరిద్దరూ ముసలివాళ్ళయిపోయారు. మూలకూర్చోండి. ఇల్లు కదిలారా, కాళ్ళు విరగ్గొడతాం. ఈ రోజు నుంచీ మేమే గ్రామపెద్దలం!" అన్నాడు.

"అంతే! మేమే పెద్దలం," అన్నాడు విజయుడు.

ఆ క్షణంనుంచీ గ్రామ పరిస్థితి పూర్తిగా మారిపోయింది. జయవిజయులు ప్రియంవదనూ, తమ తల్లిదండ్రులనూ, ఇల్లు కదలకుండా కట్టడిచేశారు. గ్రామంలో వాళ్ళ ఆగడాలు కూడా మితిమీరాయి.

పని ముగిసినట్టే. మీరు దయతలిస్తే, నేను ప్రియంవదతో పాటు గ్రామం వదిలిపోతాను," అన్నాడు పరదేశి.

పరదేశి గ్రామం వదిలిపోవడమే మంచిదని పెద్దలిద్దరికీ అనిపించింది. వాళ్ళు ఇళ్ళకు తిరిగివచ్చి, జయవిజయులతో, "ఆ పరదేశిలో, ప్రియంవదను వివాహమాడాలనే స్వార్థ బుద్ధి కలగగానే, అతడికున్న శక్తులన్నీ నశించాయి. ఇక మీరు ప్రియంవదను మరిచిపొండి," అని చెప్పారు.

"అది సాధ్యమయ్యే పని కాదు. ఏది ఏమైనాసరే ప్రియంవద మాకు కావాలి," అన్నాడు జయుడు.

పరదేశి వాళ్ళవద్దకు వెళ్ళి, ''మీరంటే యిష్టంలేని స్త్రీని చెరబడుతున్నారు. ఇది న్యాయంకాదు. కని పెంచిన తలిదండ్రుల్ని బాధించకండి,'' అని హితవు చెప్పాడు.

ఇందుకు జయవిజయులు, 'మాకు నీతులు నేర్ప చూస్తున్నావా? నిన్ను ఏమీ చేయకుండా వదిలిపెట్టాం. అది నీ అదృష్టం. వారంరోజుల్లో, గ్రామం వదిలిపెట్టకపోయావంటే, నీ ప్రాణాలు దక్కవు!'' అన్నారు.

పరదేశి అక్కడినుంచి బయలుదేరి, గ్రామస్థులతో, ''మీ గ్రామ పెద్దలు జయవిజయులకు బందీలైపోయారు. వాళ్ళను రక్షించుకోవడం, మీ బాధ్యత కాదా!'' అని చెప్పిచూశాడు.

ఈ మాటలు విన్న గ్రామస్థులు, ''వాళ్ళిద్దరూ విష్ణుమూర్తి ద్వారపాలకులైన జయవిజయులు. ముని శాపంవల్లనూ, కలిపురుషుడి కోరికమీదనూ, వాళ్ళు రాక్షస బుద్ధితో యిక్కడ జన్మించారు. ఇదంతా మా కర్మ!'' అన్నారు.

''జయవిజయుల బారినుంచి రక్షించుకునేందుకు, మీకు పెద్దలే ఉపాయమూ చెప్పలేదా?'' అని అడిగాడు పరదేశి.

"ఆ శ్రీ మహావిష్ణువే అవతరించి, వాళ్ళ ఆగడాలను అరికడతాడని పెద్దలు చెప్పారు,'' అన్నాడొక గ్రామస్థుడు.

''నేనే శ్రీ మహావిష్ణువును! రామాయణ కాలమందలి వానరుల అంశ మీలో వున్నది. ప్రియంవద లక్ష్మి. ఆమెను జయవిజయులు చెరబట్టారు. మనమంతా కలిసి ఎదిరిస్తే, ఎటువంటి రక్తపాతం లేకుండా. జయవిజయులు లొంగిపోతారు. వాళ్ళ దుర్మార్గాలనుంచి, మీకు విముక్తి లభిస్తుంది,'' అన్నాడు పరదేశి.

''నువ్వు శ్రీ మహావిష్ణువే అని నమ్మకమేమిటి? మా పెద్దలు చెప్పందే, ఏ విషయమూ మేము నమ్మము,'' అన్నారు గ్రామస్థులు.

"అలాగా, అయితే మీరందరూ నా వెంట వచ్చి, ఆ పెద్దలనే అడగండి,'' అంటూ పరదేశి బయల్దేరాడు. —(ఇంకావుంది)





# పరీక్షలు

ఒకానొక దేశంలో ఒక పేదవాడు ఎలాగూ సంసారం గడపలేక రాజువద్దకు పోయి సహాయం వేడాడు. రాజు పేదవాడి కోరిక విన్నమీదట, "నిన్ను నాలుగు ప్రశ్న లడుగుతున్నాను. అన్నిటికన్న వేగమైన దేది? అన్నిటికన్న బలం కలదేది? అన్నిటికన్న మెత్తనైనదేది? అన్నిటికన్న ఆనందకరమైనదేది? రేపటిలోగా ఈ ప్రశ్నలకు సమాధానం చెబితే నీకు సహాయం చేయటానికి ప్రయత్నిస్తాను," అన్నాడు.

పేదవాడు ఈ ప్రశ్నలను మననం చేసుకుంటూ తిన్నగా ఇంటికి వెళ్లి వాటికి సమాధానాలు తట్టక ఎంతో తికమక పడ సాగాడు. అతని కూతురు పదిహేడేళ్ళ పిల్ల తండ్రిని చూసి, "ఏమిటి నాన్నా, దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" అని అడిగింది.

"రాజుగారిని యాచించబోయాను. ఆయన నన్ను నాలుగు ప్రశ్నలడిగి రేపటి లోగా సమాధానాలు చెప్పాలన్నారు. అటువంటి జటిలమైన ప్రశ్నలకు నేనేం సమాధానాలు చెప్పగలను?" అన్నాడు పేదవాడు.

అతని కూతురు ప్రశ్నలు విని, "దీని కింత ఆలోచన దేనికి, నాన్నా? అన్నిటి కన్న వేగమైనది గాలి. అన్నిటికన్న బలమైనది భూమి; ఎందుకంటే ఎంత బలం గల ప్రాణులకు కూడా భూమే బలమిస్తుంది. అన్నిటికన్న మెత్తనైనది చెయ్యి; హంసతూలికా తల్పం మీద పడుకున్నవాడు కూడా చెయ్యి ముడిచి తలకింద పెట్టుకుంటాడు. అన్నిటికన్న ఆనందకరమైనది నిద్ర; ఇంక దేనిచేతా పోని దుఃఖం కూడా నిద్రలో పోతుంది," అన్నది.

**25–ఏళ్ళనాటి చందమామ కథ**



పేదవాడు ఈ సమాధానాలకు సంతో షించి మర్నాడు ఉదయమే రాజువద్దకు వెళ్ళి, సమాధానాలు నాలుగూ చెప్పాడు. "ఈ సమాధానాలు నీ అంతట నీవే తెలుసుకున్నావా? లేక ఎవరైనా నీకు చెప్పారా?" అని రాజు అడిగాడు.

"నా కూతురు పదిహేడేళ్ళ పిల్ల చెప్పింది." అన్నాడు పేదవాడు.

రాజు ఆశ్చర్యపడి, "నీ కూతురు అంత తెలివిగలదా? అయితే ఈ పోగు తీసుకు పోయి నీ కూతురి కిచ్చి రేపటిలోగా దీనితో నాకొక జరీ ఉత్తరీయం నేసిపెట్టమను." అని జానెడు పోగొకటి పేదవాడికిచ్చాడు.

పేదవాడు హతాశుడై ఇంటికి తిరిగి వచ్చాడు, తండ్రిని చూసి కూతురు, "ఏం, నాన్నా? రాజుగారికి నీమీద ఇంకా దయకలగలేదా?" అన్నది.

"ఆయన ఇంకో పరీక్ష పెట్టాడు. ఈ నూలు పోగుతో రేపటిలోగా నీ వాయనకు జరీ ఉత్తరీయం నేసి ఇవ్వాలట!" అన్నాడు తండ్రి.

"అదెంత భాగ్యం, నాన్నా? నువ్వొక చీపురుపుల్ల పట్టుకెళ్ళి రాజుగారి కియ్యి. దానితో మగ్గం తయారుచేసి ఈ సాయంత్రం లోగా ఇవ్వమను. జరీ ఉత్తరీయం అలాగే నేసి పెడతాను." అన్నది పేదవాడి కూతురు.

పేదవాడు చీపురుపుల్ల ఒకటి తీసుకుని రాజుగారివద్దకు పోయి కూతురు చెప్పిన మాటలే అన్నాడు.

రాజు క్షణం ఆలోచించి, "ఏమో అనుకున్నాను, నీ కూతురు చాలా ప్రయోజకురాలే. నూరు కోడిగుడ్లిప్పిస్తాను. వాటిని పొదగబెట్టి రేపు ఉదయానికల్లా పిల్లలు చేయించి నావద్దకు పంపమని నీ కూతురుకు చెప్పు." అన్నాడు.

ఇదంతా ఏదో ప్రమాదానికే వచ్చిందని భయపడుతూ పేదవాడు నూరు కోడిగుడ్లూ తీసుకుని ఇంటికి తిరిగి వచ్చాడు. అతని కూతురు మాత్రం నిశ్చింతగా ఆ గుడ్లతో అట్లూ, కూరా, పులుసూ వగైరాలు చేసి,

మూడు పూటలా తండ్రికి పెట్టి తాను కూడా తిన్నది. మర్నాడు ఆమె తండ్రితో ఈ విధంగా అన్నది:

"నాన్నా, రాజుగారి వద్దకు పోయి, గుడ్లన్నీ పాదిగాయని చెప్పు. అయితే కోడిపిల్లలు ఏ ఆహారమూ ముట్టటం లేదనీ, ఒక్కరోజు వ్యవసాయంతో పండిన ధాన్యం తప్ప అవి తినేటట్టు లేవనీ, అలాటి ధాన్యం ఉంటే ఇప్పించమనీ అడుగు. లేకపోతే కోడిపిల్లలన్నీ చచ్చిపోతాయని చెప్పు."

పేదవాడు ఈ మాటలే రాజుకు చెప్పాడు. రాజు చాలా సంతోషపడ్డాడు. ఆయన వాడితో, "నీ వింటికి వెళ్ళి, నేను రెండు గడియలలో మీ యింటికి వస్తున్నానని నీ కుమార్తెతో చెప్పు," అన్నాడు.

ఈ సంగతి తెలియగానే పేదవాడి కూతురు ఇల్లంతా అలికి ముగ్గులు పెట్టి, గడపలకు పసుపు రాచి, మండిగానికి పచ్చతోరణం కట్టింది. కాస్సేపట్లో రాజుగారు గుర్రంమీద వచ్చి పేదవాడి ఇంటి ముందు గుర్రం ఆపాడు గాని దిగలేదు. రాజుగారిని ఆహ్వానించటానికి రాబోతున్న పేదవాడి కుమార్తె కూడా వాకిలి గుమ్మం దాటబోతూ ఒక కాలు మాత్రం బయట వేసి ఆగిపోయింది.

గుర్రంమీద వున్న రాజు ఆ పిల్లకేసి చూసి, "అమ్మాయీ, నేను దిగి మీ యింట్లోకి రాబోతున్నానా? గుర్రాన్ని నడుపుకుని ముందుకు సాగబోతున్నానా?" అని అడిగాడు.

పేదవాడి కూతురు చిరునవ్వు నవ్వి, "మహాప్రభూ! మీరు నాకన్న గొప్పవారు, తెలివిగలవారు, చదువుకున్నవారు. నేను లోపలికి వెళ్ళబోతున్నానో బయటికి రాబోతున్నానో మీరు చెప్పగలిగితే మీ ప్రశ్నకు నేను సమాధానం చెబుతాను!" అన్నది.

రాజు సంతోషించాడు. గుర్రం దిగి లోపలికి వచ్చి పెద్ద వరహాల సంచీ పేదవాడికిచ్చాడు. తరవాత ఆయన ఆ పేదవాడి కుమార్తెనే పెళ్ళాడి ఆమెను తన పట్టపురాణిని చేసుకున్నాడు.



## అక్టోపస్ ధారావేగం!



అక్టొపస్ అనే జలచరం, తలలో ఉన్న గొట్టం లాంటి అవయవంతో నీళ్ళను ధారగా ముందుకు చిమ్ముతూ, అతి వేగంతో వెనక్కు ఈదుకుంటూ వెళుతుంది. ఇది తరచు ఇతర ప్రాణులను గాయపరుస్తుంది:

## బాణం వేసే చేప!

ఆగ్నేయాసియాలో ఉన్న ఒక రకం చేప, నీళ్ళ ఉపరితలం మీది చెట్లను అంటి ఉన్న కీటకాలను గురిచూసి, నోటిలోని నీళ్ళను బాణంలా వాటి మీదికి చిమ్ముతుంది. ఆపైన, అది నీళ్ళలో పడిన కీటకాలను పట్టి తింటుంది.





## జీవితాంత బాంధవ్యం

ఒకసారి జంటగా కలిస్తే, పిల్లల్ని కని, పెంచి, బొరియలు ఏర్పరచుకుని జీవితాంతం కలిసే జీవిస్తుంది—ఎలుకజాతికి చెందిన బీవర్ అనే జంతువు. ఇతర జంతువుల లాగా ఇవి తమ పిల్లలను తరిమికొట్టవు. పిల్లలే స్వయంగా పాత నివాసాలకు సమీపంలో తమ బొరియలను తయారు చేసుకుంటాయి.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



S. B. Takalkar



K. S. Vijayaker

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: వేసాలిక ప్రారంభం! రెండవ ఫోటో: ఊరేగింపుకు సంరంభం!

పంపినవారు: బి. దుర్గాభవాని, గాంతినగర్, నిడదవోలు–(ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# ఎల్లప్పుడూ ఆంప్రోనే!




కాస్త ఆగండి...
ఒక్క బిస్కట్టును తినండి.

## ఆంప్రో గ్లూకోజ్ బిస్కట్లు
## ఆంప్రో® తో మీకు నాణ్యత ఖాయం.

Sista's-EIPL-60/87 TEL